# ఆంధ్ర భామినీ విలాసము

( శ్లోక సహితము )

---

ఏని సుధామయోక్తుల యశ్రాసరసంబును గ్రోలు వాణి, చేఁ
బూనిన వీణె తంత్రులను బుట్టకనాదరము న్వహించు, నా
ధీనిధి పండితేంద్రు నుడితీరు గ్రహించి శిరంబు నూఁపఁ, డెం
తే నృపశుండు, దాఁ బశుపతిప్రతిముం డటు సేయనేర్చునే ॥


గ్రంథకర్త:—

విద్వాన్ వేదము వేంకటకృష్ణ శర్మ

ప్రథమ ముద్రణము : 1951



వెల : ప్రతి 1-కి రు 3—0—0

ఈ గ్రంథకర్త — ఇతర కృతులు

| | | | |
|---|---|---|---|
| కుందమాల (దిఙ్నాగ నాటకమునకనువాదము) .... | 2 | 0 | 0 |
| సుభాషిత రత్నమాల .... .... .... | 0 | 6 | 0 |
| శ్రీరామ (లక్ష్మీ స్వభావము : పద్య) .... .... | 0 | 6 | 0 |
| ఆంధ్ర పాండవ గీతలు (పద్య) .... .... | 0 | 8 | 0 |
| ధర్మ విమర్శనము (గద్య) .... .... .... | 1 | 0 | 0 |
| భక్త కల్ప శతకము.... .... .... .... | 0 | 8 | 0 |
| శిష్యనీతి బోధినీ శతకము .... .... .... | 0 | 3 | 0 |

(అచ్చులో ఉన్నవి)

విష్ణు మహామాయా విలాసము (పద్య) .... ....

భక్తవత్సల శతకము (చంపకములు) .... ....

ఆంధ్ర సౌందర్య లహరి .... .... ....

మహేశ మాలా (సంస్కృతము) .... ....

ఊరు భంగము (భాసనాటికకనువాదము) .... ....

పద్మప్రాభృతకము (శూద్రకకవిభాణమునకు అనువాదము)

ప్రకాశకులు :-

విద్వాన్ వేదము వేంకటకృష్ణ శర్మ,

60 సామి పిళ్ల వీధి,

మా-మద్రాసు-7.

# ఉపోద్ఘాతము

శ్రీ వేదము వేంకట కృష్ణశర్మగారు తాము రచించిన పండిత రాయల 'భామినీవిలాస (పండితరాయశతక)'— ఆంధ్రానువాదమునకు నన్నుపోద్ఘాతము వ్రాయుమని కోరిరి. నాకుఁ బ్రకృతముండు పనితొందరలచే వారికోరిక నెంతవఱకు నెఱవేర్పఁగలనో; కాని యీ యుత్కృష్టమ కావ్యమున నాకుఁ గల యభిమానముం బురస్కరించికొని, యేతద్విషయమునుగూర్చి యించుక ముచ్చటింప నుత్సహించితిని.

పండితరాయల 'భామినీవిలాసము'న నాకే కాక, మాపూర్వులకుఁ గూడ నమితాదర ముండెడిది. పండితరాజ శతకమను పేర, దానిని మొట్టమొదటఁ దెనుఁగక్షరములలో ముద్రించినవారు మా పితృవ్యులు. ఆశతకములోఁ గొన్నిశ్లోకములకుఁ దెనుఁగుపద్యములనుగూడ మాపితృవ్యులు రచించి యందుఁ జేర్చియుండిరి. ఆ ప్రథమముద్రణము యొక్క ప్రతులిప్పుడు దొరకక పోయినను, నది తిరిగియు విశాఖపట్టణమున మాముద్రాలయమునందే పునర్ముద్రితమయినది. అందు నూటికిఁ బైఁగాఁ బద్యములు గలవు. ఆపద్యములన్నియుఁ బ్రథమాక్షరముల యకారాదివరుసను ముద్రింపఁబడినవి. అటుపిమ్మట, తునిలో తునిజమీందారుగారి కోరికపై మాపితామహులగు మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలుగారు మరలఁ బ్రచురించి యుండిరి. అందు వేయింటికిఁ బైఁగా శ్లోకములు గలవు. ఆప్రచురణము యొక్క ప్రతులుగూడ నిప్పుడు దొరకుటలేదు. తరువాత ననేకస్థలములలో 'భామినీవిలాసము' ముద్రింపఁబడినది. వీని యన్నింటిలోను నేను పేర్కొనిన పైప్రథమ ప్రచురణములలోని పద్యములసంఖ్యలకు మధ్యగాఁ బద్యసంఖ్యలు గలవు. దీనింబట్టి 'భామినీవిలాసము'లోని శ్లోకసంఖ్య స్పష్టముగా మనకుఁ దెలి

యావనియు, నందుఁ బ్రక్షిప్తములు విశేషముగాఁ జేరియున్నవనియు మనము నమ్మఁదగును. అసలు పండితరాజు పద్యముల ఛాయ నుండు ననభిజ్ఞాత కర్తృకములగు సుభాషితములు గొన్ని పండితరాజున కంటఁ గట్టఁబడినట్లు తోఁచుచున్నది. భర్తృహరి శతకములకుఁగూడ నీస్థితియే సంభవించినట్లు చెప్పఁబడుచున్నది. ఇది యెట్లున్నను దీనివలన నొక యంశము స్పష్టపడుచున్నది. పండితరాజు పద్యము లత్యుత్కృష్టము లయినవనియు, నుత్కృష్టపద్యము లతనిచేతనే రచియింపఁబడి యుండవల యునియుఁ బండితులు తలంచుచుండిరి. తత్కృతి శతకము సంకీర్ణ మయినను పండితరాయల కది గౌరవాపాదకమని చెప్పవచ్చును.

రాజాస్థానములలో నుత్కృష్టతమ మనఁదగు ఢిల్లీ మొగలుల యాస్థానమునందుండిన వాఁడగుటచే నతని యన్యాపదేశము లప్రతిమము లయినవి. మిగిలిన కథ యెట్లున్నను, బండితరాజు ఢిల్లీ మొగలుల నాశ్రయించి యుండెననునది నిర్వివాదాంశము. "ఢిల్లీవల్లభ పాణిపల్లవతలే నీతం నవీనం వయః" — అని యతఁడే చెప్పుకొనియున్నాఁడు. అతఁడు అక్బరు-షాజహానుల కాలములలో జీవించియుండె ననుచున్నారు. షాజహాను కుమారుఁడగు దారాకుఁ బండితరాయలయం దపరిమితమగు నభిమానముండెను, కాని, దారా ఢిల్లీసుల్తాను కాకపోవుట పండితరాజు దురదృష్టమని చెప్పవచ్చును, దారా మరణముతోఁ బండితరాజునకు ఢిల్లీ సంబంధము తెగియుండవచ్చును. అక్బరుచక్రవర్తి పండితరాయల యపూర్వ మేధాశక్తి కాశ్చర్యపడెడివాఁడని చెప్పుదురు. షాజహాను ఇంద్రియ సుఖాకాంక్షి యగుటచే, నతనికిఁ బండితరాయలను విశేషముగా గౌరవించుట కవకాశము లేకపోయి యుండవచ్చును. పండితరాజు తనవార్ధకమును మథురలోఁ గడపి యచ్చటనే మరణించె నందురు.

పండితరాజు వ్యాకరణమున, న్యాయమున, సాహిత్యమున విశేష పాండిత్యమును సంపాదించెను. ఇతఁడు కావ్యనాటకాలంకారములను

దనపితృపాదులయొద్దను, తర్క-వ్యాకరణములను ఖండదేవుఁడు, శేషవీరేశ్వరుఁడు మొదలగు ప్రసిద్ధపండితులయొద్దను నభ్యసించెను. ఈవీరేశ్వరుఁడు కాశిలోని సుప్రసిద్ధ వ్యాకరణపండితవంశమగు శేషవంశమునకుఁ జెందినవాఁడు. ఇతని పూర్వులలో నొకఁడగు శేషరామచంద్రుఁడే 'ప్రక్రియాకౌముది'ని వ్రాసెను. భట్టోజీదీక్షితుఁ డీప్రక్రియాకౌముదీచ్ఛాయనే తన సిద్ధాంతకౌముదిని విరచించెను. ఈ భట్టోజీదీక్షితుఁడుగూడ శేషవీరేశ్వరునకు శిష్యుఁడే. అందుచేఁ బండితరాజును భట్టోజీదీక్షితుఁడును సతీర్థ్యులని చెప్పవచ్చును. కాని, వారిద్దఱును గలిసి సమకాలమున విద్యాభ్యాసమును జేసియుండరు. భట్టోజీదీక్షితుని వార్ధకదశలోఁ బండితరాజు యౌవనమున నుండియుండవచ్చును. అందుచే భట్టోజీదీక్షితుఁడు శేషవీరేశ్వరుని తండ్రియగు శేషకృష్ణునియొద్దఁగూడ విద్యాభ్యాస మొనర్చియుండవచ్చును. కాని, వీరేశ్వరుఁడుగూడఁ, దనతండ్రిగారి వార్ధకమున వారిశిష్యులకుఁ బాఠములు చెప్పియుండవచ్చును. ఆసందర్భమున భట్టోజీదీక్షితునకుఁ దానుసయితము గురువగుట తటస్థించి యుండవచ్చును. అందుచేతనే కావలయును, భట్టోజీదీక్షితుఁడు తనకుమారునకు 'వీరేశ్వరదీక్షితుఁ'డని నామకరణము చేసెను. పండితరాజుమాత్రము వీరేశ్వరుని శిష్యుఁడనుట నిర్వివాదాంశము. "అస్మద్గురు వీరేశ్వరాణాం తనయైః ఖండితాపి"— అని తన మనోరమాఖండనమున వ్రాసికొని యున్నాఁడు.

ఈ మనోరమాఖండన ప్రస్తావమువలనఁ దిరిగియు భట్టోజీదీక్షితుని ప్రసంగము కొంచె మెత్తవలసివచ్చును. భట్టోజీదీక్షితుఁడు శేషవీరేశ్వరునకు, నతనితండ్రిగారికిని శిష్యుఁడగుచు, వారిపూర్వుల ప్రక్రియాకౌముదీచ్ఛాయను దానొక నూతన గ్రంథమును 'సిద్ధాంతకౌముది'- యను పేర వ్రాసి, దాని కీర్తికి భంగము గలిగించు ప్రయత్నము చేయుటయేకాక, 'ప్రౌఢమనోరమ'- యను స్వోపజ్ఞ సిద్ధాంతకౌముదీ వ్యాఖ్యానమునఁ బ్రక్రియాకౌముదిని ఖండించెను. ఇది పండితరాజు సహింపలేక, భట్టోజీ

దీక్షితుని గురుద్రోహి యని నిందించెను. ఇది చాలక తనగురువగు వీరేశ్వ
రుని కుమారుఁడు ఖండించియున్నను, దాను దిరిగియు 'ప్రౌఢమనోరమ'
ను- 'మనోరమాకుచమర్దన' మను గ్రంథమున ఖండింప నారంభించెను.
తన గ్రంథనామకరణమునందే తన యసహిష్ణుతను వెల్లడించెను.

శేషవంశమువారు ప్రథమమున గోదావరీమండలవాసులై యుండి.
తరువాతఁ గాశిలో వాసము నేర్పఱచుకొనిరి. పండితరాజుకూడ గోదా
వరీ మండలమువాఁడే. ముంగండ గ్రామనివాసి. అతని తండ్రి పేరుభట్టు;
తల్లి లక్ష్మీదేవి. వారింటిపేరు 'ఉపద్రష్ట'-వారు. పండితరాజ జగన్నా
థుని కుటుంబమును, అతనిగురుకుటుంబమును నాంధ్రదేశమునకుఁ జెంది
నవే. అందుచే నాంధ్రులందఱును గర్వించుటకుఁ గారణము గలదు.

పండితరాజు గొప్పపండితుఁడైనను, నతనియందు పురోభాగిత్వము
విశేషముగాఁ గలదు. అతని గ్రంథములలో ముఖ్యములయినవి ఖండన
రూపములుగా నున్నవి. 'రసగంగాధర'- మతని గ్రంథములలో నెల్ల
ముఖ్యతమ మయినది. అది యితరమత ఖండనములతో నిండియున్నది.
అలంకారశాస్త్రమున ముఖ్యముగ నప్పయదీక్షితుఁ డతనిఖండనమునకు
గుఱి యగుచుండెను. అతని 'చిత్రమీమాంస'-కుఁ బ్రత్యేకముగ ఖండ
నము వ్రాసెను. అతని మనోరమాఖండన మిదివఱకే పేర్కొనఁబడినది.
జగన్నాథునకు సహనశక్తి లేదు. తన ప్రతిద్వంద్వులను సులభముగా
విడువఁడు- 'భామినీవిలాసము'- కాక, యితఁడింకను మఱికొన్ని చిల్లర
గ్రంథములను రచించియున్నట్లు తెలియుచున్నది. 'ఆసఫవిలాసము'-
'జగదాభరణము'- 'ప్రాణాభరణము'- 'యమునావర్ణనచంపు'- అను
గ్రంథములను దాను రచించినట్లు తనరసగంగాధరమునఁ జెప్పుకొని
యున్నాఁడు. 'లక్ష్మీలహరి'- 'గంగాలహరి'- 'అమృతలహరి (యమునా
స్తోత్రము)'- 'కరుణాలహరి'- 'సుధాలహరి'- అను చిన్నస్తోత్రగ్రంథ
ములనయిదింటినిఁగూడ జగన్నాథుఁడు రచించెను.

ఇప్పుడు మనకుఁ బ్రసక్తమయినది 'భామినీవిలాసము'. ఇది నాలుగు భాగములుగా నున్నది. అన్యోక్తి సముల్లాసము, శృంగార సముల్లాసము, కరుణ సముల్లాసము, శాన్త సముల్లాసము- అని వానికిఁ గ్రమముగఁ బేరులు. 'పండితరాజశతకము'- అని దీని వ్యవహారముండుటచే, నొక్కొక్క సముల్లాసమున నూటేసి శ్లోకములుండుట న్యాయ్యము. కాని, నేను పైని జెప్పినట్లు కొన్ని ప్రక్షిప్తము లిందుఁ జేరియుండవచ్చును. అందుచేఁ బ్రకృతము లభించిన శ్లోకములన్నియుఁ బండితరాయలవి యగునో, కావో చెప్పఁజాలము. కాని, మూలశ్లోకములన్నియుఁ బండితరాజు రచించినవే; కాని యతనిచేఁ బూర్వకవులనుండి సేకరింపఁబడినవి కావు. "మదీయ పద్యరత్నానాం మంజూషైషా కృతా మయా"- యని యతఁడు తనపుస్తకమును గుఱించి చెప్పుకొని యున్నాఁడు. అందుచే భర్తృహరిశతకములఁగూర్చి యున్న సందేహము దీనినిగుఱించి పడవలసిన యవసరము లేదు. ఇందులో, నన్యోక్తిసముల్లాసమున ౧౦౧ శృంగారసముల్లాసమున ౧౦౨ కరుణసముల్లాసమున ౧౯ శాంతిసముల్లాసమున ౩౩ జగన్నాథపండితరాయల శ్లోకములకును, ఈ నాల్గింటిలోను గలిసి ౧౯౦ ప్రక్షిప్తశ్లోకములకును, శ్రీ వేంకటకృష్ణశర్మగారు తెనుఁగుపద్యముల రచించిరి.

భామినీవిలాసములోని శ్లోకము లన్నియు ముక్తకములు. ఇట్టి ముక్తక కావ్యములు సంస్కృతమున విశేషముగా నున్నవి. శృంగార రస యుక్తములయినవి యధికము. వీనిలో 'అమరుశతకము' చాలఁ బ్రసిద్ధి చెందినది. మిగిలిన కావ్యములు నీతిబోధకములుగ నున్నవి. జనులకుఁ బురుషార్థములను బోధించుటకు వేద పురాణములనే కాక, కావ్యములను గూడ మనవారు సాధనములుగా నుపయోగించిరి. వేదములలో నుపదేశించిన ధర్మములనే తిరిగియు నితిహాస పురాణములలోను, గావ్యములలోను మనవా రుపదేశించిరి. కేవలధర్మములను మాత్రము రాజాజ్ఞలవలె

నుపదేశించు వేదములు ప్రజలకు దుర్బోధములు గావచ్చును. ఆధర్మ
ములనే యుపాఖ్యానములతోఁ జేర్చి, నిదర్శన పూర్వకములుగా నుపదే
శించినచో, సులభముగా బోధపడు నని మనవా రితిహాసపురాణములను
వ్రాసిరి. అంతకంటెను మృదుమధురశైలిని అలంకరించి చెప్పినచో,
హృదయముల నాకర్షించు నని కావ్యములమూలమున నాధర్మములనే
మనవా రుపదేశింప సాగిరి. ఇట్లు పురుషార్థముల నుపదేశించుటకు కావ్య
రీతి క్రమముగఁ బ్రవర్తించినది. ఈపనిని నిర్వహించుటకు వక్రోక్తిమార్గ
మధిక సాధక మని మనవారు తలంచి యన్యోక్తులను రచింపఁబూని యుండ
వచ్చును. రెండు నిషేధార్థకపదము లెట్లు విధిని దృఢపఱచునో,
ప్రశ్నార్థకవాక్య మెట్లు యథాస్థితిని దృఢపఱచునో, యట్లే యన్యాప
దేశము నుద్దిష్టార్థమును దృఢపఱచును. ఈపద్ధతిని విషయమును బోధిం
చుట మనవారికి మొదటినుండియు నలవాటై యున్నది. ఋగ్వేదములో
8-వ మండలములోని 29,164 సూక్తము లీయన్యాపదేశములకు బీజము అని
చెప్పవచ్చును. ఇందు మొదటిసూక్తమునందలి 10 ఋక్కులలోను పది
మందిదేవతల నిర్వహించిన గొప్పకార్యములు నామనిర్దేశరహితములుగ
వర్ణింపఁబడియున్నవి. రెండవదానిలో 52 మంత్రములు గలవు. వీనిలో
సూర్యుఁడు, మేఘములు, మెఱపు, అగ్ని- మొదలగు దేవతల కార్యము
లన్యాపదేశములుగా వరింపఁబడియున్నవి. కొన్ని మంత్రము లెవర
నుద్దేశించి వ్రాయఁబడినవో సరిగాఁ దెలిసికొనుట కష్టముగా నున్నది.
అథర్వవేదమునఁగూడ నిట్టిసూక్తములు కొలఁదిగఁ (9-2;-11-4,5;19,
53,54) గలవు. వేదకాలమున నిట్టికావ్యము లప్రధానములుగ నుండి
నను, క్రమముగా నివి ప్రబలి సంస్కృతవాఙ్మయమున నొకప్రధానస్థాన
మును బొందినవి. ప్రత్యేకగ్రంథములుగాఁ గాక, సుభాషితగ్రంథము
లలో నిట్టి యన్యాపదేశము లెక్కుడుగఁ జేరియున్నవి. 'భామినీవిలా
సము'- వంటి విశిష్టగ్రంథములను గొన్నింటి నుదాహరణముకొఱకుఁ

పేర్కొనఁదగును:— అప్పయదీక్షితుని వంశస్థుఁడగు అచ్చాన్దీక్షితుని 'అన్యోక్తిమాల'.— సోమనాథుని 'అన్యోక్తిశతకము'.— చంద్రచూడుని 'అన్యోక్తికంఠాభరణము'.— నీలకంఠదీక్షితుని 'అన్యాపదేశశతకము'.— మధుసూదనుని (యింకొక) 'అన్యాపదేశశతకము'— మొదలగునవి. ఆంధ్రమున నన్యాపదేశ కావ్యములు లేవు. ఆంధ్రవాఙ్మయమునకు సంస్కృత వాఙ్మయము మొదటినుండియు నుపజీవ్యముగా నున్నది. ఇప్పుడది మఱియొకక్రొత్తవిధమున నుపజీవ్య మగుచున్నది. ఈ 'భామినీవిలాసము'ను దెనుఁగున ననువదించిన శ్రీవేదము వేంకటకృష్ణశర్మగారు తెనుఁగువాఙ్మయమున కెంతేని సేవచేసినవా రగుచున్నారు. ఇంతకుఁబూర్వముగూడఁ బండితరాయుల పద్యములు తెలుఁగున ననువదింపఁబడినవి. మా పితృవ్యులరచనను గుఱించి పైని బ్రసంగించియున్నాఁడను. అమృతానందస్వాముల ముఖ్యశిష్యులగు శ్రీదంటు సుబ్బావధానిగారు పదిపదునైదు సంవత్సరములకు మునుపు 'భామినీవిలాసము'- నాంధ్రీకరించి యచ్చువేయించి, విజయనగర మహారాజావారి సంస్కృతకళాశాలలో నేనుండఁగాఁ దెచ్చి, మాకందఱకుఁ జదివి వినిపించిరి. అయినఁ దిరిగియు దానిం దెనుఁగున ననువదించుట యనవసరము గాఁజాలదు. మురారి చెప్పినట్లు మంచివిషయములను గవులు వర్ణితపూర్వము లని విడువఁగూడదు. 'ముఖే ముఖే సరస్వతీ'- యనినట్లు ప్రతిగ్రంథమునను నవ్యత యుండకతీరదు. శ్రీవేంకటకృష్ణశర్మగారికవిత్వము సరసమయినది. శైలి సులభమయినది. వీరి పరివర్తనము మూలమున కనన్యూనాతిరిక్తముగా నున్నది. ఈగ్రంథము వ్రాసి వీరాంధ్రభాషకొనర్చిన సేవ కడుంగడుఁ బ్రశంసనీయము. ఇట్లింకను వీరు గ్రంథాంతరములను రచించి యాంధ్రవాఙ్మయమున కలంకారములను జేకూర్తురు గాక!

తిరుపతి. 18-1-1950 — పరవస్తు వేంకటరామానుజస్వామి(ఎం.ఏ).
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాలాధ్యక్షుఁడు.

# విజ్ఞప్తి

నా యొద్దనుండిన యొకానొక బొంబాయిప్రతి 'భామినీవిలాసము' ననుసరించి యీ యనువాదమును కడచిన చిత్రభాను సం॥న సాగించితిని. తరువాత ప్రాచ్యలిఖిత పుస్తకాగారములోని ప్రతుల నేకొని, యీ క్రింది గ్రంథములు (1) 1895 సం॥న శ్రీ మహాదేవసూరి దీక్షితుల 'ప్రదీపికా' వ్యాఖ్యతోఁ బ్రచురింపఁబడిన (బొంబాయి) ప్రతి, (2) 1935 సం॥న విద్యాసుధాకర శ్రీ హరదత్తశర్మగారి 'చమక' వ్యాఖ్యతో ముద్రితమయిన (పూనా) ప్రతి, ఇది దాదాపు బొంబాయిప్రతి ననుసరించినది.— (3) శ్రీ ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారి 'భామినీవిలాస శతక' ఆంధ్రానువాదము. ఇందు అన్యోక్తులే 401 పద్యములున్నవి. (4) శ్రీభమిడి సత్యనారాయణగారు 1926 సం॥న ప్రచురించిన 'పండితరాయల జీవితము' అను గ్రంథము. (5) 1937 సం॥న అచ్చయిన శ్రీపంటు సుబ్బావధానిగారి 'ఆంధ్ర భామినీవిలాసము'లను గూడఁ జూచితిని.

నేను చాలవఱకు (1), (2) గ్రంథములలోనివే కొని, (3) వ దానిలోని ప్రక్షిప్తముల ముఖ్యములని తోఁచినవానింగూడఁ దలఁగించితిని.

ఇయ్యది ముద్రించి ప్రకటింపఁదలంచినంతన కొందఱు మిత్రులును శిష్యులు నార్థికముగ సాయమొనరింప ముందుకువచ్చి నన్నుఁ బ్రోత్సహించిరి. ముఖ్యముగ నామిత్రులును, రాజాప్రింటర్సు ప్రొప్రయిటర్లునగు శ్రీ చమర్తి చెంగల్రాజుగారికి నాయెడను, నాముద్రణకార్యము నెడను గల శ్రద్ధాభక్తులు మఱువరానివి. వారికెల్ల నా హృదయపూర్వకాశీస్సులు, మఱి తమకుఁగల యనివార్య కార్యముల నేని త్యజించి, వాత్సల్యమున నా యనువాదమును సాంతముగఁ బరిశీలించి యుపోద్ఘాతము వ్రాసియొసంగిన శ్రీ వేంకటేశ్వరప్రాచ్యకళాశాలాధ్యక్షులగు శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామిగారికిని, ముద్రణవిషయమున నాకుఁ జేదోడు వాదోడుగ నుండిన మిత్రవరేణ్యులు శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారికిని నా కృతజ్ఞతాభివందనములు. ఆంధ్ర విద్వల్లోకము పండితరాయలయందలి గౌరవమున నేని ఇందలి గుణదోషములం దెలుపఁ బ్రార్థితులు.

ఇట్లు, వేదము వేంకటకృష్ణశర్మ.

# స్వవిషయము

శ్రీ సమ్మానిత భారతీ సదన, మా
శ్రీ కృష్ణరాయాధిపా
వాసం, బట్టకవీంద్ర దిక్కరివర
వ్యాహారరంగం, బహి
త్రాసు స్వంగ్రహాష్టైక వీరభట గే
హం, బాంధ్రదేశంబునన్
వాసిన్ రాయలసీమ గాంచి, సిరులం
భాసిల్లుఁ, దత్క్షోణిలోన్॥ ౧

తేట తెల్గుల తీపి మాటల తేనెలు,
ఋగ్వేదికవి, నల్వాయింతి కొసఁగ,
జానుఁదెల్గుల సువాసన పల్కుఁబూసరుల్,
మల్లన, చదువులతల్లి కిడియెఁ
గమ్మ తెల్గుల చవిగల నుడుగుకట్టల్
పెద్దయ పోత్తంపువెలఁది కొసఁగె
మేలి తెల్గుల మగఱ్ఱాలకై తలనగల్
పొల్పద్దికవి వీణపాలఁతి కిడియె
నెచట, నా తొండమండల మింపులొలుకు
తెలుఁగు విద్దెల పడఁతి యందియలమ్రోఁత

భువన విజయంబుగా విని, ప్రోడులెల్లఁ
జివురులెత్తిన యసమ విచిత్రధాత్రి॥

సాళువ మాంక నృపాలక
పాలితమయి తన్మహీశ భవభూపా వా
సాలంకృతమయి మివులం
గ్రాలును గార్వేటినగర రాజ్యం బందుఁ॥

పదకవీశ్వర సారంగపాణి మధుప
మధుర సంగీత ఝుంకార మండితమ్ముఁ
ప్రౌఢ కవిరాడనంతరాడ్వంశ రత్న
పికమృదు ధ్వని చిత్రవాగ్విలసిత సుది॥

శ్రీ వేణుగోపాల లావణ్యశతకమ్ము
లొనరించి గ్రామంబుఁ గొనియె నొకఁడు,
విప్రనారాయణ విష్ణుభక్త చరిత్ర
వ్రాసి యాందోళికల్వడసె నొకఁడు,
చంపురామాయణ సత్కృతి ననువాద
ముంజేసి కవిమేరఁ బొందెనొకఁడు,
అలసాని పెద్దనవలెఁ జాటువుం జెప్పి
గండపెండారమ్ముఁ గాంచె నొకఁడు,
వీసరేంద్రుల కొల్వుకూటాన వెలసి
యట్టి కార్వేటినగరధరాధిపతులు,
సత్యధర్మ దయాదాన శౌర్యయుతులు
ఆంధ్ర గీర్వాణభాషా మహాభిరతులు॥

వారి శాస్త్రితు లాప్తు లాచారయుతులు
ఆంధ్ర వైదికులును గౌశికాన్వవాయు
లాహితాగ్నులు పాండితీ వ్యాప్తయశులు
విబుధ గురువరతుల్యులు వేదకులులు॥ ౬

అవనిపాల ప్రదత్త పల్యంకికాది
సకల సమ్మానకలితు, లాస్థాన ముఖ్య
పండితేంద్రులు రాట్కుల బ్రాహ్మణాలంబ
పొలుచు వేదాన్వవాయులఁ బొగడఁదరమె॥ ౭

వారలలో శ్రుత్యంత వి
చారుఁడు శాస్త్రోక్త కర్మ సారాచారుం
డారాధిత గురుపాదుం
డా రమణాంఘ్రి ప్రసంగ సములగుణుండై॥

ఆయనఘుండు గాంచె సుతు
లైదుగురన్, నరసింహదీక్షితున్
ధీయుతు, సుబ్బయన్ సుకవి,
దేవి పదాంబుజ భక్తు శేషయన్,
గాయజమూర్తి వేంకయ, న
కల్మష రాజకృతి ప్రవీణ ధీ
తోయత చిత్తు రామయను
చక్రిమహాయుధపంచకం బనన్॥ ౯

అధివాగ్మితుఁ డగు, నగ్న్యాధాన మొనరించి
దీపించె నరసింహ దీక్షితుండు,

జ్యోతిష వ్యాకృతి శాస్త్రజ్ఞుఁడై కవి
శాశ్వతిఁ బడసె సుబ్బయ్యశాస్త్రి
శ్రీ విద్యఁగని, మంత్రసిద్ధుఁ, డంతర్వాణి
యని యశంబందె శేషయ్యభట్టు
రాజకార్య ధురంధరత మించి నుతికెక్కె
వేంకట నారాయణాంక బుధుఁడు

మహితవైదిక లౌకిక విధి వివేకుఁ
డసమ భారతరామాయణాది సకల
సత్కథాఖ్యానకుశలుఁడు శర్వభక్తి
పరుఁడు, రామయ దీనార్తిహరణ చణుఁడు॥

అందు, రామయ బుధునకు, సమ్మహాత్మ
పత్నియగు సుబ్బనరసమ పావన తర
గర్భమున నల్వురాత్మజుల్ గలిగి, రేను
జ్యేష్ఠుఁడను, గొల్వఁ దమ్ములు నెలమిఁగాంతు॥

గురుజన పాదపద్మములఁ
గొల్చి గడించిన పాండితిం, గటా!
చిరము వ్యయించితిం బహుల
శిష్యుల బోధయొనర్చుటం దె, నేఁ
దిరముగ నిందు నందు నియ
తిన్ యశమిచ్చు కృతిన్ రచింపఁగా
దొరకొననైతి జీవితమె
దూషితమయ్యె నటంచుఁ గుందుచున్॥

అవకాశ మొదవ, నపుడపు
డెవియొ కృతుల్గొన్ని నే రచించితి వానిన్
బ్రవిమలమతిఁ దిలకించిన
కవులెడఁద న్మెచ్చుకొనుటఁ గడునుత్సుకతన్॥ ౧౩

పండిత రాయల 'భామిని'
కుండు ప్రశస్తిని దలంచి యుద్యద్భాషా
మండనముగఁ దెలిఁగింపఁగ
నిండుమదిం బూనుకొంటి నిపుణులు పొగడన్॥ ౧౪

ఆంధ్రమున వ్రాసి రాకుండి వ్యాసశాస్త్రి,
దంటు సుబ్బావధాని, యా దంటలట్లు
వ్రాయలే, నైనఁ, బండితరాయకృతిని
చాపలత రేఁప నే నిటు సలిపినాఁడ॥ ౧౫

అనువాదంబున నాయువజ్ఞతను జే
యం బద్ధ దోషంబు లె
ల్లను సద్దంబున యట్లు గాంచుటకు వీ
ల్గా నుండు నంచుం, బుధేం
ద్రుని శ్లోకంబులు గూడఁ జేర్చితిని, 'ని
ర్దోషంబు నా తర్జుమా'
యని గర్వంబునఁ జాటి చెప్పుటకుఁ గా
దంచార్యు లూహింపుఁడీ॥ ౧౬

ఎనిమిది యేండ్లనాఁడు రచి
యించిన కావ్యము నేఁటికిట్లు కూ

ర్త్రిని హితులెల్ల నాదుకొన
మేలిమి పొత్తమురూపుఁ గాంచె స
న్మనమున దీనిఁ జూచి, మతి
మంతులు మెచ్చినఁ జాలు, నింక, నా
జననము సార్థకంబనుచు
స్వాంతమునం దలఁతున్ సుధీవరుల్॥ ౧౭

కావ్యమున గుణ మెదియేనిఁ గ్రాలునేని
అది జగన్నాథపండితునిదిగఁ గొనుఁడు
దోష మెదియేని మదికింత దోఁచెనేని
అది మదీయమ మన్నింపుఁడయ్య! కరుణ॥ ౧౮

గొప్ప కవులె కవితలలోఁ
బప్పునఁ దారడుగువైవఁ బొల్పడ, నిఁక, నా
తప్పుల నడుగ న్వలయునె?
కుప్పలు గలుగున్ క్షమింపఁ గోరుదు బుధులన్॥ ౧౯

తప్పొప్పు లెసఁగుఁ 'దూ' 'చా'
తప్పని తెలిఁగింపుగాదు, దయతోఁ దజ్ఞుల్
దప్పులు నొప్పులు దెలిపినఁ
దప్పక గ్రహియింతుఁ దలనుదాల్చి యడఁగువన్॥ ౨౦

# శ్రీజగన్నాథ పండితరాయ ప్రశస్తి

శ్రీ ఢిల్లీశ్వర దత్త భోగములఁ జే
  ర్మిం గాంచి, విద్యాధిక
ప్రౌఢిన్ విద్వదఖర్వగర్వదళన
  ప్రఖ్యాతి నార్జించి, సం
వ్యాఘ్రాంచత్కవితా మహత్త్వమున 'శో
  హో' యంచు శీర్షంబులన్
మూఢుల్ గూడఁ గదల్చ శోభిలిన నిన్
  గొల్తుం బుధేంద్రా, మదిన్ ॥

పండితరాయ! త్వన్మధుర
  వాక్సముదంచిత భావ బంధురా
ఖండ రస స్రవ న్మహిత
  కావ్య కృతి ప్రవణాత్మ హా 'మొఘల్'
మండలనాథ మానసము
  లన్ హరియించి బహూకృతుల్ గడుం
దండిగఁ గూర్చ నీవెగద
  ధన్యుఁడవన్ సుకవీంద్రమండలిన్ ॥

పరమ పవిత్రాంధ్ర వసుమతీ వసుమతీ
త్రిదశ వంశంబున నుదయమంది
ప్రకటిత గీర్వాణ భారతీ భారతీ
పాండిత్య సంపదఁ బరిఢవిల్లి
మానిత ఢిల్లీరమానాథ మానాథ
మోదదాయిని కావ్యమును రచించి,
మహిత గుణాతిసమ్మానిని మానిని
యువని నర్ధాంగిఁగా నాదరించి

జహ్నుసంభూత సంభూత సకలదురిత
నికర హారక! హార కనక దుకూల
శోభివై, భవ వైభవ స్ఫురణ మంది
విబుధరాజేంద్ర! రాజేంద్ర వినుతిఁ గంటి॥

శ్రీః

పణ్డితరాజ తిలక జగన్నాథ ప్రణీతః

# భామినీ విలాసః

## అన్యోక్తి సముల్లాసః



మాధుర్య పరమసీమా
సారస్వత జలధి మథన సంభూతా
పిబతా మనల్ప సుఖదా
వసుధాయాం మమ సుధా కవితా.॥ 1

దిగన్తే శ్రూయన్తే మద మలిన గండాః కరటినః
కరిణ్యః కారుణ్యాస్పద మసమశీలాః ఖలుమృగాః
ఇదానీం లోకేస్మి న్ననుపమ శిఖానాం పునరయం
నఖానాం పాండిత్యం ప్రకటయతి కస్మి న్మృగపతిః.॥ 2

పురా సరసి మానసే వికచ సారసాళి స్ఖల
త్పరాగ సురభీకృతే పయసి యస్య యాతం వయః
స పల్వల జలేధునా మిల దనేక భేకాకులే
మరాల కుల నాయకః కథయ రే కథం వర్తతామ్.॥ 3

తృష్ణా లోల విలోచనే కలయతి ప్రాచీం చకోరీగణే
మౌనం ముఞ్చతి కించ కైరవకులే కామే ధనుర్ధున్వతి
మానే మానవతీజనస్య సపది ప్రస్థాతు కామేధునా
ధాతః కింను విధౌ విధాతు ముచితో ధారాధరా డమ్బరః.॥ 4

శ్రీః

# భామినీవిలాసము

## అన్యోక్తి సముల్లాసము

కం. భూరిమధురిమకు నెల్లయు,
సారస్వత జలధి మథన సంభూతయుఁ, బెం
పారఁగ సుఖదయు నగు నా
చారు కవిత్వామృతము వెసం జగ మాయుఁ—॥ 1

గీ. మద మలిన గండ కరటులు మసలె దెసల
తుదలఁ, గరిణులు కరుణ కాస్పదములెవ్వ,
మృగము లసమ శీలంబులు ;— మృగపతి యుఁద
దేన నిశితాగ్ర నఖపాండితిని వెలార్చు॥ 2

గీ. ఫుల్ల జలజావళీ చ్యుత పుష్పరేణు
సురభిళం బగు మానస సరసి నీట,
పయసు, మును, గడపిన హంసపతి, యనేక
భేక వృత వాపి నిప్పు డేవిధి మెలంగు॥ 3

ఉ. తూరుపునం జకోర వితతు ల్గనుఁ దృష్ణఁ జలించు చూపులం,
గైరవపాళి మౌన ముదుగ న్వికసిల్లు, మరుందు బావటం
కార మొనర్చు, మానవతి కాంతము మానమడంగు, నిట్టిచో
వారిజ డంబరంబు విధుఁ బైకొనఁ జేసెదు, ధాత ! యేలొకో ? 4

## భా మి ని వి లా సః

అయి దలదరవింద స్యందమానం మరన్దం
తవ కిమపి లిహన్తో మఞ్జుగుఞ్జన్తు భృఙ్గాః
దిశిదిశి నిరపేక్ష స్తావకీనం వివృణ్వ
పరిమల మయ మన్యో బాన్ధవో గన్ధవాహః.॥ 5

సముపాగతవతి దైవా
దవహేలాం కుటజ మధుకరే మాగాః
మకరన్ద తున్దిలానా
మరవిన్దానా మయం మహామాన్యః.॥ 6

తావ త్కోకిల విరసాన్
యాపయ దివసాన్ వనా న్తరే నివసన్
యావత్ మిలదలిమాలః
కోపి రసాలః సముల్లసతి.॥ 7

నితరాం నీచోస్మీతి
త్వంఖేదం కూప మా కదాపికృథాః
అత్య న్త సరసహృదయో
యతః పరేషాం గుణగ్రహీతాసి.॥ 8

కమలిని మలినీకరోషి చేతః
కిమితి బకై రవహేలితా మభిజ్ఞైః
పరిణత మకరన్ద మార్మికా స్తే జగతి
భవన్తు చిరాయుషో మిలిన్దాః॥ 9

# భామినీవిలాసము

చ. అరవిరి తమ్మి! నీదు తొలుకాడెడు తేనియ నిచ్చఁ గ్రోలి సు
స్వరమునఁ బల్కు నీదు చెవిపజ్జన తేం; ట్లిఁక నీదు కోర్కియుం
బొరయక, దిగ్గగంతములఁ బూర్తిగ నింపును ద్వత్పరీమళం,
బరయఁగ గంధవాహుఁడను నన్యుఁడు బాంధవుఁ డొక్కఁడెంతయున్

క. నినుఁ జేర, దైవవశమునఁ
జనుదెంచిన యళిని దెగడఁ జనకు కుటజపూ
కన, నది, మరంద తుందిల
వనజాతంబులకు మువ్వుల బహుమాన్య గదా॥ 6

కం. లలితరసాలము, మిలదళి
కులమాల యెదేని, పూచి గుమ్మనుదనుకన్
పలఁగంద్రోయు వనాంతర
ముల నెందే విరస దివసములను పికంబా॥

కం. 'కడు నీచమ' నని వేసట
పడకుము, నీవెపుడుఁగాని పటుసరసత నొ
ప్పెడు నంతఃకరణం బే
ర్పడఁ, బరగుణములె గ్రహింతు వడిఁ, గూపంబా!

క. అవహేళితాఖిలజ్ఞము
లపు బకముల కతనఁ, గలఁగ నగునే యాత్మన్,
భువిఁ బక్వమధుగుణజ్ఞము
లివె, యళులు చిరాయులగుచు నెసఁగఁ గమలినీ॥ 9

యేనామన్ద మరన్దే
దలదరవిన్దే దినా న్యనాయిషత
కుటజే ఖలు తేనేహా
మధుకరేణ కథమ్॥ 10

అయి మలయజ మహిమాయం
కస్య గిరా మస్తు విషయస్తే।
ఉద్గిరతో యద్గరలం ఫణినః
పుష్ణాసి పరిమలోద్గారైః॥ 11

పాటీర తవ పటీయాన్ కః
పరిపాటీ మిమా మురీకర్తుమ్
యత్పిషతా మపి నృణాం
పిష్టోపి తనోషి పరిమలైః పుష్టిమ్ 12

నీరక్షీరవివేకే హంసాలస్యం
త్వమేవ తనుషే చేత్
విశ్వస్మి న్నధునాన్యః
కులవ్రతం పాలయిష్యతి కః॥ 13

ఉపరి కరవాల ధారాకారాః
క్రూరాః భుజఙ్గమ పుఙ్గవాత్
అన్తః సాక్షాద్ద్రాక్షా దీక్షా
గురవో జయన్తి కేఽపి జనాః 14

# భా మి నీ వి లా స ము

క. విచ్చిన తామరఁ బెచ్చగు
నచ్చపుఁ దేనియల, దినము లటువచ్చి, యెటుల్
మెచ్చును? నేఁడీ కుటజము
నిచ్చలుఁ దా మధుకరేంద్రుఁ దెవ నకటకటా! 10

క. మలయజమ! నీదు మహిమలఁ
బలుకఁగ నెవ్వనికి వీలుపడు? గరళంబున్
వెలిఁ గ్రక్కు నాగములఁ బరి
మలపు సముద్గారములను మనుతువు గాదే॥ 11

క. పాటీరమ! నీవగు పరి
పాటిం జేకొనఁగ నెవరి వశమగు? నిన్నుం
గాటముగ నూఱు జనులకు
నేటుగ గంధమునఁ బుష్టినే యిడుదు కదా!॥ 12

క. ఈ రీతి నీవు నీర
క్షీర వివేకమున నాలసించినచో, నిం
కేరీ కుల వ్రతంబును
నారయఁ బాలింతు రన్యు లవనిని హంసా॥ 13

గీ. ఖడ్గ ధారాంచితాకార కలన వెలికిఁ
బ్రాఁచులటు క్రూరులై, యెద ద్రాక్షకేళి
గడు మధుర బోధ లొసఁగు దీక్షాగురువులు
గొందఱు గలారు, వారికగుం జయంబు॥ 14

స్వచ్ఛన్దం దళదరవిన్ద తే మరన్దం
విన్దన్తో విదధాతు గుఞ్జితం మిలిన్దాః
ఆమోదా నథ హరిదంతరాణి నేతుం
నైవాన్యో జగతి సమీరణా త్ప్రవీణః॥ 15

యాతే మయ్యచిరా న్నిదాఘ మిహిర జ్వాలాశతైః శుష్కతాం
గన్తా కంప్రతి పాన్థ సన్తతి రసౌ సన్తాపమాలాకులా
ఏవం యస్య నిరన్తరాధి పటలై ర్నిత్యం వపుః క్షీయతే
ధన్యం జీవన మస్య మార్గసరసో ధి గ్వారిధీనాం జనుః॥ 16

ఆపేది రేమ్బర పథం పరితః పతఙ్గా
భృఙ్గా రసాలముకులాని సమాశ్రయన్తి
సఙ్కోచ మఞ్చతి సర స్త్వయి దీనదీనో
మీనో ను హన్త కతమాం గతి మభ్యుపైతు॥ 17

మధుప ఇవ మారుతోస్మి న్మా
సౌరభ లోభ మమ్బుజిని మంస్థా
లోకానామేవ ముదే మహితో
ప్యాత్మార్థితాం నీతః॥ 18

గుఞ్జతి మఞ్జు మిలిందో
మాలతి మామౌన ముపయాసీః
[illegible] వదాన్యగురవః
సాదర[illegible]నం వహన్తి సురతరవః॥ 19

## భా మి నీ వి లా స ము

గీ. ప్రస్ఫుటాంబుజమా ! నీమరంద మాని
శ్రుతిసుఖంబుగ మధుపముల్ రొద యొనర్చుఁ
గాని, నీపరిమళము దిక్సమితితుదలఁ
బఱుప శక్తుం, డనిలుకంటెఁ బరుఁ డెవండు ? ॥ 15

ఉ. వేసవి యెండ వేండ్రమున వేగమ నేనిటు శోషిలఁగా, గదుఁగా
వేసటనొందు పాంథతతి విశ్రమ మెయ్యెడఁ గాంచు నంచుఁ, జిం
తాసహితాత్మ వైచుఁ, గృశతం గను మార్గసరోవరంబ ! త్వ
ద్వాసిత జీవనం బెపుడు ధన్యము ; వారిధి జన్మ మేలొకో ॥ 16

గీ. సరసి ! నీవింకిపోవ, గ్రీష్మంబునందు
నాకసముఁ జేరు హంస ముఖాండజములు,
అకట మాకంద ముకుళము లాశ్రయించు
దీనమీనము లేగతి నూను,? నకట ॥ 17

గీ. వారిజిని ! మధుపమువలె మారుతునెడ
సౌరభమునఁ బ్రలోభంబు సలుపవలదు,
అతిమహాతుఁ డాతఁడిట్లు భైక్ష్యమ్ము నెపుడు
లోక మోదంబుకొఱకె తాల్చును, గడంగి॥ 18

క. లలిత రవం బొనరించెదు
శిఖిమెడ మౌనమును వీడుమా, మాఱతి ! దా
తృ[illegible]సద్వరములు సురతరు
వులె దానం దలను దాల్చుఁ బూజ్యతదోఁపఁగా॥ 19

యై స్త్వం గుణగణవానపి
సతాం ద్విజిహ్వై రసేవ్యతాం నీతః
తానపి వహసి పటీరజ
కింకథయామ స్త్వదీయమౌన్నత్యమ్ ?

అపనీత పరిమలాంతరకథే
పదం న్యస్య దేవతరుకుసుమే
పుష్పాంతరేపి గంతుం
వాఞ్ఛతిచేత్ మధుప ధన్యోసి॥ 21

తటిని చిరాయ విచారయ విన్ధ్య
భువ స్తవ పవిత్రతాయాః
శుష్యన్త్యా అపి యుక్తం కిం
ఖలు రథ్యోదకాదానమ్॥ 22

ఏక స్త్వం గహనేస్మి న్కోకిల
నకలం కదాచి దపి కుర్యాః
సాజాత్య శంకయామీ న
త్వాం విఘ్నన్తి నిర్దయా కాకాః॥ 23

పత్ర ఫల పుష్ప లక్ష్మ్యా
కదాప్యదృష్టం వృతంచ ఖలుశూకైః
ఉపసర్పేమ భవన్తం
బర్బుర వద కస్య లోభేన ?॥ 24

## భా మి నీ వి లా స ము

గీ. గుణగణము లుండియున్నను గొప్పవారు
గొలువఁ దలకొనరు ద్విజిహ్వములను నీవు
తనువునం దాల్చుకతనఁ జందనకుజంబ!
త్వన్మహోన్నత్య మిఁక మాకుఁ బలుకఁదరమె ?॥ 20

క॥ పూరితాన్య పరిమళమై రహించు
దేవతరుసుమమున నడుగిపు వెట్టి
యభిలషింతువయేని ప్రష్పాంతరమున
కరుగ, నీతెల్వి కేమందు మళివతంస ॥ 21

క॥ తటినీ! వింధ్యమున జనిం
చుటను బవిత్రమవు నీవు, శోషించిననుం
దటుకున బాటల నీర్గొను
టెటుయుక్తమగుఁ? వివేక మించుక వలదే ?॥ 22

క॥ కోకిలమ! యేకతంబున
నీకానం జేయఁబోకుమీ కలరవమున్
గాకులు సజాతిశంకన్
నీకు న్నిర్దయతఁ గూర్పనేరవు వధమున్ ॥ 23

క. ఫలపత్ర పుష్పసంపద
గలుగదు. నీయందుముండ్లు గదుఁజెలఁగెడు, నే
ఫలమందగఁ మేమిఁకనీ
పలనం జేరుదుము, చెపుమ, బర్బురకుజమా 24

తరుకుల సుషమాపహారం
జనయన్తిం జగతి జీవజాతా_ప్తి_మి
కేన గుణేన భవానీతాత
హిమానీ మిమాం వహసి ॥ 25

అమరతరు కుసుమసౌరభ
సేవన సంపూర్ణ సకల కామస్య
పుష్పాన్తర సేవేయం
భ్రమరస్య విడమ్బనా మహతీ ॥ 26

కలభ తవా న్తిక మాగత
మలిమేనం మాకదా ప్యపజ్ఞాసీః
అపి దానసుందరాణాం
ద్విపధుర్యాణామయం శిరోధార్యః ॥ 27

పృష్టాః ఖలు పరపుష్టా
పరితో దృష్టాశ్చ విటపినః సర్వే
మాకన్ద నప్రపేదే
మధుపేన తవోపమా జగతి ॥ 28

తోయై రల్పై రతికరుణయా భీమభానౌ నిదాఘే
మాలాకార వ్యరచి భవతా యా తరోరస్య పుష్టిః
సా కిం శక్యా జనయితు మిహ ప్రావృషేణ్యేన వారాం
ధారాసారా నపి వికిరతా విశ్వతో వారిదేన ॥ 29

క॥ తరుకుల సుషమాపహారియు
ధర జీవప్రకరతాపదాయియు నగు నీ
సరణిఁ గని హాసుసంహతి నే
మరుసఖ సహియించెదో భవానీజనకా ॥ 25

గీ॥ దేవతరుసుమ సౌరభసేవనమున
నన్ని కాముకులును బూర్తియై రమించు
నళికిఁ బుష్పాంతరమ్ముల ననుభవించు
నహహా మిగుల విడంబన మగుసుగాదె॥ 26

క॥ కలభము నీకడఁ జేరెడు
నళికిం బొనరింపఁబోకు మపమతి, దానో
జ్జ్వలములు ద్విపధుర్యంబులు
దలఁదాల్చుం దాని నెపు డుదార ప్రీతిన్ ॥ 27

క॥ పరపుష్టము లడుగంబడెఁ
బరిగతవిటపులును జూడఁబడె, మధుపముచేఁ,
బరికింప ఖగతి నీకవి
సరియై మాకందమా! ప్రశంసం గనునే?॥ 28

ఉ॥ వేసవిమండుటెండఁ గృపవేమఱుఁ గొంచెపునీట బ్రాణికిం
జేసిన నీదుపెంపకము, నెక్కొనుప్రావృషవేళ వారిధా
రాసమితిం జగంబు విశిరంబొనరించెడు నీరదంబు దా
నేసరణిం ఘటింపఁగల దింతయు, నోవనపాల! పల్కుమా ? 29

ఆరామాధిపతి ర్వివేక వికలో నూనం రసా నీరసా
వాత్యాభిః పరుషీకృతా దశదిశా శ్చండాతపో దుస్సహః
ఏవం ధన్వని చంపకస్య సకలే సంహారహేతావపి
త్వం సిఞ్చ న్నమృతేన తోయద కుతో ప్యావిష్కృతో వేధసా ॥ 30

న యత్ర స్థేమానం దధు రతి భయభ్రా న్త నయనా
గలద్దానోద్రేక భ్రమ దలికదమ్బాః కరటినః
స్థలి న్ముక్తాహారే భవతి పరలోకం గతవతి
హరే రద్యద్వారే శివశివ, శివానాం కలకలః ॥ 31

దధానః ప్రేమాణం తరుషు సమభావేన విపులం
న మాలాకారో సా వకృత కరుణాం బాలబకులే
అయంతు ద్రాగుద్య త్కుసుమ నికరాణాం పరిమలై
ర్దిగంతానాతేనే మధుప కులఝంకార భరితాన్ ॥ 32

మూలం స్థూల మతీవ బన్ధన దృఢం శాఖాః శతం మాంసలా
వాసో దుర్గమహీధరే తరుపతే కుత్రా స్తి భీతి స్తవ
ఏకః కింతు మనాగయం జనయతి స్వా న్తే మమాధిజ్వరం
జ్వాలాలీ వలయీభవ న్నకరుణో దావానలో ఘస్మరః॥ 33

గ్రీష్మే గ్రీష్మతరైః కరై ర్దినకృతా దగ్ధోపి యశ్చాతక
స్త్వాం ధ్యాయన్ ఘనవాసరా కథమపి ద్రాఘీయసో నీతవా
న్దైవా ల్లోచనగోచరేణ భవతా తస్మిన్నిదానీం యది
స్వీచక్రే కరకానిపాతనకృపాం తత్కం ప్రతిబ్రూమహే॥ 34

మ॥ వనపాలుం డవివేకి, నీరస మిలాభాగంబు; వాత్యాహతిన్
జనితక్రూరత నెల్లదిక్కులెసఁగున్; జండాంశుఁడున్ దుస్సహుం,
డనయం, బన్నియుఁ జంపకంబునకు సంహారాస్పదంబుల్గదా! [30
వినుఁ బీయూషముఁ జిల్కువాని, కెటుగాంచెం ధాత, యోతోయదా!

మ॥ కడు జాల్వారు మదాంబులన్ మధుపసంఘాతంబు మ్రోల్గన్, భయం
బడరం జూపుల, నెందు మున్గరులు ధైర్యస్ఫూర్తిమై నిల్వ, ని
ప్పుడు తత్సింహబిలంబు వాకిలి లుఠన్ముక్తాభరంబౌచు, సం
సదిగా నుండె శివారుతంబులఁ, గటా! తత్పంచతాప్తిచేన్॥ 31

గీ॥ తుల్యమగు ప్రేమఁ గనుఁ జెట్లఁ దోఁటమాలి
కాని, లేఁబొగడను గడుఁగరుణఁ జూడఁ
డయిన సుమగుచ్ఛ పరిమళ, మది, యశితతి
విపభరిత దిక్తటముల శీఘ్రముగఁ జూటు॥ 32

చ॥ తరువర! నీదుటోదె వితతం, బిఁక బంధనమా దృఢంబు, బం
ధువములు శాఖలున్, వసతి దుర్గమహీధరసీమ, నెందు నీ
కరయఁగ భీతి? కాని, యదయాత్ముఁడు ఘస్మరుఁ డాదవానలుం
డురువడి మంటలం గముచి యూడ్చునో నిన్నని యాత్మఁ గుందుదున్

మ. ఘనుఁడా! వేసవి దారుణాంశువుల వేఁకం గాల్చు నెద్దాని నా
యసుఁ, డా చాతక మాత్మ నిన్దలఁచు దెక్లోఁ ద్రోయ దీర్ఘాహముల్
గనులం భాగ్యతఁ దోఁచి తిట్లు పడగండ్లన్ దానిపై బువ్వు నీ
యనుకంపం గనుఁగొన్న. నెవ్వనికి మేమూడంచగున్ దీనినిన్॥ 34

దవదహన జటాల జ్వాల జాలాహతానాం
పరిగలిత లతానాం మ్లాయతాం భూరుహాణామ్
అయి జలధర శైల శ్రేణి శృంగేషు తోయం
వితరసి బహు కోయం శ్రీమద స్తావకీనః ॥ 35

శృణ్వన్ పురః పరుష గర్జిత మస్య హస్తి
రే ప్రోష్ఠ విహ్వల మనా నమనాగపి స్యాః
విశ్వార్తి వారణ సమర్పిత జీవనోయం
నాకర్ణితః కిము సఖే భవతామ్బువాహః ॥ 36

సౌరభ్యం భువనత్రయేపి విదితం శైత్యం ను లోకోత్తరం
కీర్తిం కించ దిగఙ్గనాఙ్గణగతా కిం త్వేతదేకం శృణు
సర్వానేవగుణా నియం నిగిరతి శ్రీ ఖండ తే సుందరా
ఉజ్ఝన్తీ ఖలు కోటరేషు గరల జ్వాలాం ద్విజిహ్వావలీ ॥ 37

నాపేక్ష్యం నచదాక్షిణ్యం
నప్రీతి ర్నచసంగతిః
తథాపి హరతే తాపం
లోకానా మున్నతో ఘనః ॥ 38

సముత్పత్తిః స్వచ్ఛే సరసి హరిహస్తే విలసనం
విలాసః పద్మాయాః సురహృదయహారీ పరిమలః
గుణైరేతై రన్యై రపిచ లలిత స్యామ్బుజ తవ
ద్విజోత్తంసే హంసే రతి రతీవోన్నతి రియమ్ ॥ 39

చ. దవదహనాతికీలల వితానము ద్రెక్కొన వ్రాలుతీవలున్
సవసెడు భూరుహంబులు మనన్ దయఁ గొండలవాళ్లకొమ్మలం
దవిరళతోయముం గురియుదౌర ! నిరంతరమీవు, శ్రీసుదుం
డెవఁడిఁకనీకు సాటియగు నెంచ భువిన్ జలవాహ ! చెప్పుమా 35

గీ. ఓరి పాంథుఁడ ! యిదె, మేఘు దారుణంపు
టుఱుము విని, కట ! కలఁగరు ముల్లమందు
నకుఁడ ! విశ్వార్తి వారించుటకు సతండు
జీవనం బిడు వాఁడని చెప్ప వినవె ? 36

చ. పరిమళమో త్రిలోకముల వ్యాప్తము, శైత్య మలౌకికంబు, వి
స్ఫురయశమో దిగంగనల ముంగిటఁ బొంగెడుఁ, గాని కోటరాం
తరగత మా ద్విజిహ్వసముదాయము గ్రక్కు విసంపుమంటలన్
దరికొను. నీయుదంచిత గుణంబులు సర్వము, చందనాగమా ! 37

గీ. కోరికయె లేక, దాక్షిణ్యగుణము లేక
ప్రియము లేకించు కేసంగతియును లేక
యుండినను, బ్రాణి తాపంబు నుడుపునట్టి
యున్నతుండగు ఘనుఁడెవో సన్నుతుండు ! 38

చ. సరసిరుహంబ ! నీభవము స్వచ్ఛసరస్సున, నీనివాస మా
హరికరమందు, నీవు రమకాలయ, మాత్రిదశాత్మహారి నీ
పరిమళ, మిట్టి సద్గుణ విభాసితవీవు ; ద్విజేంద్రు, హంస సా
దరమునఁ జూచితేని యిఁక ద్వన్మహిమోన్నతి వన్నెకెక్కదే ? 39

సాకం గ్రావగణై ర్లుఠ న్తి మణయో బాలార్కబింబోపమా
తీరే నీరచరైః సమం సభగవా న్నిద్రాతి నారాయణః
ఏవం వీక్ష్య తవావివేక మపిచ ప్రౌఢాం పరాముస్నతైః
కిం నిన్దా మ్యథవా స్తవామి కథయ క్షీరార్ణవ స్త్వాం మహామ్॥ 40

కింఖలు రత్నై ర్నేతైః కింపున
రభ్రాయితేన వపుషా తే
సలిలమపి య న్నతావక మర్ణప
వదనం ప్రయాతి తృషితానామ్ ॥ 41

ఇయత్యాం సమ్పత్తా వపిచ సలిలానాం త్వమధునా
న తృష్ణా మార్తానాం హరసి యది కాసార సహసా
నిదాఘే చణ్డాంశౌ కిరతి పరితోఙ్గార నికరం
కృశీభూతః కేషా మహహ పరిహర్తాసి ఖలుతామ్ 42

అయి రోష మురీకరోషి నోచే
త్కిమపి త్వాంప్రతి వారిధే వదామః
జలదేన తవార్థినాపి ముక్తా
న్యపి తోయాని మహో న్నహో జహాసి ॥ 43

న వారయామో భవతీం విశ న్తీం
వర్షానది స్రోతసి జహ్నుజాయాః
నయుక్త మేతత్తు పురో యదస్యా
స్తరఙ్గ భఙ్గా న్ప్రకటీకరోషి ॥ 44

చ. దినపతి తుల్యరత్నములు తీరమునందలి రాలగుంపుతో
ననయముఁ గూడియుండుఁ; బరమాత్ముఁడు శ్రీహరి నీట నిద్రనొం
దును జలజంతులం గలసి; దుగ్ధపయోనిధి! యిట్లు కాంచి త్వ
ద్ఘనమహిమావివేకము; లిఁకన్నిను దూఱుదునా? నుతింతునా? 40

క. పారావారమ! తృషితుల
నోరను నీ నీరమేఁటికనునె? యింకేలా?
యీరత్నంబులు, మఱియీ
వారిదసమమైన నీదు వపువుం జెపుమా! 41

మ. సరసీ! నీవిపు డంబుసంపదఁ గడుంజాల్వారియుఁ గ్రాంతతృ
ష్ణ రయానన్ హరియింపఁ జాలని యెడం, జండాంశుఁ డంగారకో
త్కరముల్ చల్లు నిదాఘమందుఁ గృశవై క్రాలంగ, నీవేరికిన్
దొరఁగింపంగల వార్తయింత, యహహా! తోయంబులం బల్కుమా

గీ. ఓయిజలనిధి! కోపింప కుంటివేని
నేమువచియింతు మొకమాట; నీవు దొడ్డ
వాఁడవయ్యును నకట! నిన్వేఁడుజలదు
నకు నతని చేతఁగొన్న యుదకమె యిడవు 43

క. ప్రావృణ్ణది! జహ్నుసుతా
పావనధునిఁ జొచ్చునిన్ను వారింపము పో!
వావిరి తరంగ లీలలు
గావించుట నీకు దానికడఁ దగదుసుమీ! 44

పౌలోమీపతి కాననే విలసతాం గీర్వాణ భూమీరుహాం
యేనాఘ్రాత సముజ్ఝితాని కుసుమా న్యాజిఘ్రిరే నిర్జరైః
తస్మి న్నద్య మధువ్రతే విధివశా న్మాధ్వీక మాకాంక్షతి
త్వంచే దఞ్చసి లోభ మమ్బుజ తదా కిం త్వాం ప్రతి బ్రూమహే॥

ముక్తా మృణాలపటలీ భవితాని పీతా
న్యంబూని యత్ర నలినాని నిషేవితాని
రే రాజహంస వద తస్య సరోవరస్య
కృత్యేన కేన భవితాసి కృతోపకారః ॥ 46

ప్రారమ్భే కుసుమాకరస్య పరితో యస్యోల్లసన్మఞ్జరీ
పుఞ్జే మఞ్జుల గుఞ్జితాని రచయం స్తా నాతనో రుత్సవాన్
తస్మి న్నద్య రసాలశాఖిని దశాం దైవా త్కృశా మఞ్చతి
త్వంచే న్ముఞ్చసి చఞ్చరీక వినయం నీచ స్త్వదన్యో౽స్తి కః॥ 47

ఏణీగణేషు గుణగర్వ నిమీలితాక్ష
కిం కృష్ణసార ఖలు ఖేలసి కాననేస్మిన్
శోభా మిమాం కలయ భిన్న కరీన్ద్ర కుమ్భ
ముక్తామయీం హరి విహార వసున్ధరాయాః ॥ 48

జఠర జ్వలన జ్వలతా
వ్యవగత శఙ్కాం సమాగతాపి పురః
కరిణా మరిణా హరిణా
హరిణాలీ హన్యతాం ను కథమ్? ॥ 49

శా. పాలోత్కృష్టవయేశు సంపసపుఁ గల్పాస్మజ సూనంబులన్
లీలన్వాసనచూచి యెప్పుడువిరణా లేఖుల్ సుగంధంబుఁ గొం
ద్రోలిన్, వాఁడు మధువ్రతుండు మధురాంఘ్రిద్రిష్టుఁడై యెట్లు నీవధిన్
వే లోభంబిపు డంబుజంబ! గనుచో నిన్నేసుసం జెల్లునో ? 45

గీ. రాజహంస! బిసప్రకరముసు దింటి
వారిఁ గ్రోలితి, వట్ట సేవనముఁ గంటి
వాసకోశరమున; దాని కేసుకృతిని
సలిపి, ప్రత్యుపకారి కాఁగలవొ ? చెపుమ, 46

మ. భ్రమరా! దేనివికాసమంజరి సహస్రంబందు మంజుస్వనం
బమరన్ నంతసముంది తెంతయు వసంతారంభమం, దారసా
లమహీజాతము దుర్విధిం గృశతఁ గ్రాల, న్వీడితే నిష్ఠుఁ బ్రే
మము, నీకంటె నెవండు నీచఁదరయుం బల్కంగదే యొక్కనిన్

మ. ఉరుగర్వాన నిమీలితాంబకమవై యుద్వృత్తిఁ గ్రీడింతు వా
హరిణీ వ్రాతముఁ గూడి యీ యడవి; నేలా ? భిన్నమాతంగరా
డ్వరకుంభస్థల మౌక్తికాళిమయముం బంచాస్యసంచారయు
గ్ధరణీభాగము, కృష్ణసారమ! యిటన్ గాల్నిల్పఁగాఁ జెల్లునే? 48

క. ఉదరాగ్ని దహింపంబడు
నదియయ్యుం, గరివిరోధి యగుహరి, భీతిన్
వదలి మృగోత్కర మెదుటనె
మెదలుచునున్నను హరింప మేకొనదుగదా! 49

# భా మి నీ వి లా సః

యేన భిన్న కరికుమ్భ విషజ్జ
న్మౌక్తికావలిభి రఞ్చితా మహీ
అద్య తేన హరిణా న్తికే కథం
కథ్యతాం ను హరిణా పరాక్రమః ॥ 50

స్థితిం నో రే దధ్యాః క్షణమపి మదాన్ధేక్షణ సఖే
గజశ్రేణీ నాథ త్వమిహ జటిలాయాం వనభువి
అసౌ కుమ్భిభ్రాన్త్యా ఖర నఖర విద్రావిత మహా
గురు గ్రావ గ్రామః స్వపితి గిరిగర్భే మృగపతిః 51

నిసర్గాదారామే తరుకుల సమారోప సుకృతీ
కృతీ మాలాకారో వకులమపి కుత్రాపి నిదధే
ఇదం కో జానీతే య దయ మిహ కోణా న్తరగతో
జగజ్జాలం కర్తా కుసుమతతి సౌరభ్య భరితమ్॥ 52

యస్మిన్ ఖేలతి సర్వతః పరిసర త్కల్లోల కోలాహలై
ర్మన్థాద్రి భ్రమణ భ్రమం హృది హరి ద్దన్తావలాః పేదిరే
సోయం తిమితు జఙ్గిలాఙ్గ కవలీకార క్రియా కోవిదః
క్రోడే క్రీడతు కస్య కేలికలహ త్యక్తార్ణవో రాఘవః ॥ 53

గిరి గహ్వరేషు గురుగర్వగుమ్భితో
గజరాజపోత న కదాపి సఞ్చరేః
యది బుధ్యతే హరి శిశు స్తనన్ధయో
భవితా కరేణు పరిశోషితా మహీ ॥ 54

గీ. వేనిచే భిన్న కరికుంభ విచ్యుతోరు
మౌక్తికాళి సమంచిత మౌధరిత్రి,
యట్టిమృగనాథుచే నిపుడెట్టుచూపఁ
బడు స్వశౌర్యము జింకలపజ్జ నకట! 50

మ. ప్రమదాంధేక్షణ! మిత్రమా! గజకులేంద్రా! దట్టమౌపొదయర
ణ్యమునన్నీవు వసింపఁబోకు క్షణమైనన్, గుంభివిభ్రాంతిఁదీ
క్ష్ణములౌ గోళ్లను గొప్పఱాలగమి వీఁకం జీల్చు నాసింహస
త్తముఁడెంతే గిరిగర్భమందు సుఖనిద్రం గాంచు నెల్లప్పుడున్॥ 51

గీ. ద్రుమకులారోపణము నిసర్గముగఁ జేయు
సుకృతి, కృతి, వనపాలుండు సుమభరాతి
సురభిభరిత జగజ్జాల వరవకుళము
నిలిపె, నేమూలనో, యెవ్వనికిఁ దెలియును? 52

చ. పరిచల దూర్మినాద పరివర్తిత మందరశైలమంచు, ది
క్కరులుభ్రమించు నేది తమకంబున నాడఁగ, నాతిమింగిలో
త్కరకవలీకరోద్ధుర, ముదంచిత కేలినమిద్విముక్తసా
గరమగునట్టి రాఘవ మిఁక న్విహరించును వేలనిచ్చలున్ 53

గీ. గజపతి తనూజ! గురుమదగ్రస్తుఁడవయి
నగగుహల మసలకుము. స్తనంధయములు
మృగపతికిశోరము, లచట మేలుకొనిన,
భూస్థలిఁ గరేణు పరిశేషముగ నొనర్చు 54

యానం మత్త మతఙ్గజైః కియదపి ఛ్ఛిన్నం తుషారార్దితైః
శిష్టం గ్రీష్మజ భీష్మ భానుకిరణై ర్భస్మీకృతం కాననమ్
ఏషా కోణగతా ముహుః పరిమలై రానన్దయన్తీ దిశో
హా కష్టం లలితా లవఙ్గ లతికా దావాగ్నినా దహ్యతే ॥ 55

స్వర్లోకస్య శిఖామణిః సురతరుగ్రామస్య ధామాద్భుతం
పౌలోమీ పురుహూతయోః పరిణతిః పుణ్యావలీనామసి
సత్యం నన్దన కిం త్విదం సహృదయై ర్నిత్యం విధిః ప్రార్థ్యతే
త్వత్తః ఖాణ్డవ రఙ్గ తాణ్డవ నటో దూరేస్తు వైశ్వానరః 56

స్వస్వవ్యాపృతి మగ్న మానసతయా మత్తో నివృత్తే జనే
చఞ్చ్వా కోటి విపాటితాఙ్గసపుటో యాస్యామ్యహం పఞ్జరాత్
ఏవం కీరవరే మనోరథ మయం పీయూష మాస్వాదయ
త్యన్తః సంప్రవివేశ వారణ కరాకారః ఫణి గ్రామణీః ॥ 57

రే చాఞ్చల్యజుషో మృగాః శ్రితనగాః కల్లోలమాలాకులా
మేతా మమ్బుధి కామినీం వ్యవసితాః సంగాహితుం వా కథమ్
అత్రేవోచ్ఛల దమ్బు నిర్భర మహావర్తైః సమావర్తితో
యత్ గ్రావేవ రసాతలం పునరసౌ యాతో గజగ్రామణీః ॥ 58

పిబ స్తన్యం పోత త్వమిహ కిల దన్తావళధియా
దృగన్తానాధత్సే కిమితి హరివన్తేషు పరుషా
త్రయాణాం లోకానా మపి హృదయతాపం పరిహర
న్నయం ధీరంధీరం ధ్వనతి నవనీలో జలధరః ॥ 59

చ. అడవి యొకింత యన్యపగజాహతముగా, మిహికార్ద్రిఘాతముగా
గడమయ్యుగ్రీష్మ భీష్మకరవిగాఢగభస్తుల భస్మితంబు, నె
య్యెడ వసియించియో దెసల నెల్ల సుగంధముఁ జల్లుచందమై
యడరెడు నీలవంగలత హా! చపపహ్నాని గాల్పఁగాఁబడెగా 55

మ. దివిషల్లోక శిరోవిభూషణము, వెంతే నద్భుతావాస మౌ
దుపు కల్పావళికిగా, శచీంద్రుల్సేయు పుణ్యాశిపం,
టపుగానగా, విధివేఁడుదుర్ సుహృదులెన్నగా దవ్వునన్ పీడ ఖాం
డవరంగంబునఁ దాండవించు శిఖి, నిన్. దార్నందనారామమా! 56

చ. 'తమతమ కర్మలన్ మననుదార్కొన లోకులు నన్నువీడి పై
శమచనఁ, జంచుకోటిని సలాకల నూడిచి, గూటినుండినే
నమిత ముదాన నేగుదు'నటన్నతలంపునఁ జొక్కియుండఁగీ
రము, కరిహస్తరూప ఫణిరాజములోపలఁజొచ్చె నక్కటా! 57

ఉ. చంచలభావముం గలిగి సంశ్రిత పర్వతభూములై సదా
మించుమృగంబులార! యిటు మేటియలగ్గల జాహ్నవిం బ్రవే
శించయతింతురేలొకో?, విశేషముగాఁగల సుళ్ల, రాల్పలెగా
సంచలమందు చేగును రసాలతసీమకు సామజేంద్రముల్! 58

గీ. త్రావు, మిదెపాలు, కుట్టుఁడ! చంతి యనుముఁ
బరుషదృక్కుల దిక్కులఁ బఱపెదేల?
ముజ్జగంబుల హృత్తాపమును హరించు
నవవినీలాబ్ధ గంభీరనాద మదియు॥ 59

ధీరధ్వనిభి రలం తే
నీరద మే మాసికో గర్భః
ఉన్మద వారణ బుద్ధ్యా
మధ్యే జఠరం సముచ్ఛలతి॥ 60

వేతుణ్డ గణ్డ కణ్డూతి
పాణ్డిత్య పరిపన్థినా
హరిణా హరిణాలీషు
కథ్యతాం కః పరాక్రమః ॥ 61

నీరా న్నిర్మలతో జని ర్మధురతా రామా ముఖస్పర్ధినీ
వాసో యస్య హరేః పరే పరిమలో గీర్వాణ చేతోహరః
సర్వస్వం తదహో మహాకవిగిరాం కామస్య చామ్భోరుహ
త్వం చే త్ప్రీతి మురీకరోషి మధుపే కిం త్వాం వదామక్షమాహో ॥ 62

లీలా ముకులితనయనం
కిం సుఖశయనం సమాతనుషే
పరిణామ విషమ హరిణా
కరినాయక వర్తతే వైరమ్ ॥ 63

విదుషాం వదనా ద్వాచః
సహసా యాంతి నో బహిః
యాతా శ్చే న్నపరాయన్తి
ద్విరదానాం రదాఇవ ॥ 64

క. నీరద! చాలింపుము. నీ
ఘీరధ్వని. మానికపుఝ కీపంచెడు నా
యీరుచిరగర్వ. మున్మద
వారణమనుభ్రాంతి నెగిరివడు జతరమునన్॥ 60

క. పేతండ గండకండూ
త్యాతతపాండిత్య పైరియగు కేసరిచే
బ్రాఁతిగనెట్టి పరాక్రమ
మేఁతటినేఁ జాటఁబడునె యేణావళులన్। 61

చ జననమొ తేటనీట, విలసద్రుచియో తరుణీ ముఖప్రియం,
బునికియొ విష్ణుహస్తమున, నుజ్జ్వలగంధమొ నిర్జరాత్మలం
గొనుఁ, గవివాక్సమాంబకులఁ గూర్చెడుసాధన, మీవహో! యిటుల్
వనజమ! ప్రీతిఁజూపు మధుపంబునఁ జెప్పెడిదేమి విన్నఁకన్ 62

క. లీలా ముకుళిత నయనమ
పై లాలిత సౌఖ్యనిద్ర నందెదవేలా?
కాలపరిణతిని విషముఁ
దాలుచు హరిపైర మెరుగదా? దంతివరా! 63

క. వెలుపడవు పండితాస్యం
బులనుండి లటాన వచనములు, వెలువడుచో
వెలయవు పరాఙ్ముఖములయి
యులద్విరదంబుల రదంబులప్లరయంగన్। 64

ఔదార్యం భువనత్రయేపి విదితం సమ్భూతి రమ్యోనిధేః
వాసో నన్దనకాననే పరిమలో గీర్వాణచేతోహరః
ఏవం దాతృగురోర్గుణాః సురతరోః సర్వేపి లోకోత్తరాః
స్యాదర్థి ప్రకరార్థ త్పూరణవిధౌ చైకో వివేకో యది ॥ 65

ఏకో విశ్వసతాం హరా మ్యపఘృణః ప్రాణా నహం ప్రాణినా
మిత్యేవం పరిచిన్త్య మాస్మ మనసి వ్యాధానుతాపం కృథాః ॥
భూపానాం భవనేషు కించ విమలక్షేత్రేషు గూఢాశయాః
సాధూనా మరయో వసన్తి కతిన త్వత్తుల్య కక్షాః ఖలాః ॥ 66

విశ్వాస్య మధురవచనైః
సాధూ న్యే వఞ్చయన్తి నమ్రతరాః
తా నపి దధాసి మాతః
కాశ్యపి యాత స్తవాపిచ వివేకః ॥ 67

అన్యా జగద్ధితమయీ మనసః ప్రవృత్తి
రన్యైవ కాపి రచనా వచనావలీనామ్
లోకోత్తరా చ కృతి రాకృతి రార్తహృద్యా
విద్యావతాం సకల మేవ గిరాం దవీయః ॥ 68

ఆపద్గతః ఖలు మహాశయ చక్రవర్తీ
విస్తారవ త్యకృత పూర్వ ముదారభావమ్
కాలాగరు ర్దహనమధ్య గతోపి శశ్వ
ల్లోకోత్తరం పరిమలం ప్రకటీకరోతి॥ 69

చ. అమరతరూ! వదాన్యగురువా! త్వదుదారత యీ త్రిలోకవే
ద్యము, ఘనసంభ్రమం దునికి యాదివిజేశు వనంబునన్. సుగం
ధము సురచిత్తహారి, యిఁక దాసిన యర్థుల కోర్కులిచ్చుకా
ర్యమున వివేకిపైనఁ ద్వదనంత గుణంబు లచింత్యముల్గదా!॥ 65

ఉ. 'నమ్మిన ప్రాణిజీవములణంచెద' నంచెదఁ జింతనొంది తా
పమ్ము వహింపఁబోకు, మిఁక వ్యాధుఁడ! నిర్దయులై రహ
స్యమ్ముగ హింసకుంగడఁగు సట్టిరు సాధ్వరులౌనరుల్, నితాం
తమ్ము నగళ్ల క్షేత్రములఁ ద్వత్సములై వసియింతురెందఱో॥ 66

క. ఏనరులతి వినయమునం
దీనియపలుకులను సాధునికరము నమ్మం
గా నొనరిచి వంచింతురొ,
యానరుల సహింతు తెలివి యడఁగెనె? ధరణీ!॥ 67

చ. అమిత విలక్షణంబు హృదయాంతరవృత్తి: మహావిచిత్రమౌ
నమలినవాక్యజాల రచనాంచితరీతి; యలౌకికంబు కా
ర్యము! గడు నార్తహృద్యమగు నాకృతి; విద్వదశేషసంగతుల్
విమలము లెంతయుం; బొగడవీలౌకొ? పల్కులకుందవీయముల్

గీ. భువి మహాశయ సార్వభౌముండు ముప్పు
నందయినఁజాటు నౌదార్య మతిశయముగ,
ననలు నడుమను నున్నఁ, గాలాగురువతి
దివ్య పరిమలమునె చల్లు దెసలయందు॥ 69

విశ్వాభిరామ గుణగౌరవ గుమ్ఫితానాం
రోషోపి నిర్మలధియా వరమణీయ ఏవ
లోకం ప్రృణైః పరిమలైః పరిపూరితస్య
కాశ్మీరజస్య కటుతాపి నితాన్తరమ్యా ॥ 70

లీలా ల్లుణ్ఠిత శారదాపుర మహాసంపద్భరాణాం పురో
విద్యాసద్మ వినిర్గళ త్కణ ముషో వల్గన్తి చే త్కవయః
అద్య శ్వఃఫణినాం శకున్త శిశవో దన్తావలానాం శశాః
సింహానాంచ సుఖేన మూర్ధని పదం ధాస్యన్తి శాలావృకాః ॥ 71

గీర్భి ర్గురూణాం పరుషాక్షరాభి
స్తిరస్కృతాయాన్తి నరా మహత్త్వమ్
అలబ్ధ శాణోత్కషణా నృపాణాం
నజాతు మౌలౌ మణయో వసన్తి॥ 72

వహతి విషధరా న్పటీరజన్మా
శిరసి మషీపటలం దధాతి దీపః
విధురపి భజతేతరాం కళంకం
పిశునజనం ఖలు బిభ్రతి క్షితీన్ద్రాః ॥ 73

సత్పూరుషః ఖలు హితాచరణై రమన్ద
మానందయ త్యఖిల లోక మనుక్త ఏవ
ఆరాధితః కథయ కేన గుణై రుదారై
రిన్దు ర్వికాసయతి కైరవిణీ కులాని॥ 74

గీ. నిరుపమగుణాతిశయ పూర్ణ నిర్మలాత్మ
లకు జగతిఁ గిన్క కూడ నలంకరణమె,
భువన మలరించు పరిమళమున నెసంగు
నట్టి కాశ్మీరజపుగాటు నతిముదంబె॥ 70

శా. విద్యాసద్మ వినిర్గళత్కణముషుల్ వేపామరుల్ లీలమై
సద్యోలుంఠిత శారదాపుర మహాసంపద్భరాగ్రస్థలిన్
బ్రోద్యద్వాక్కుల మించిచో, ఖగశిశుల్ భోగీంద్రులన్, హస్తులన్
మాద్యద్రీతి శశంబులుం హరుల శ్వానంబుల్ శిరంబెక్కవే? 71

గీ. గురుల పరుషాక్షరయుత వాక్కులఁ దిరస్క
రణముఁ బొందిన నరులిలగణుతిఁగాంత్రు
సానఁబెట్టని మణులు రసాతలేంద్ర
మౌళి నెప్పుడును వసియింపఁ జాలవుగద! 72

గీ. తాల్చు మలయజ మా విషధరము లెపుడు,
శిరమున వహించు దివ్వె మషీపటలము,
విధుఁడుఁగూడ ధరించును వేడ్క మచ్చ,
నట్లె భరియింత్రు పిశున జనాళి నృపులు॥ 73

గీ. సజ్జనుఁడు గోరకయ హితాచరణములను
జగతికి ముదంబుఁగూర్చు, నేజనునిచేతఁ
గొలువఁబడి, తా సుధారాంశువులను గైర
విణీ పలంబుల విరియించు విధుఁడు, చెపుమ! 74

పరార్థ వ్యాసఙ్గా దుపజహ దథ స్వార్థపరతా
మభేదై కత్వం యో వహతి గుణిభూ తేషు సతతమ్
స్వభావా ద్యస్యా న్తః స్ఫురతి లలితోద్దామ మహిమా
సమర్థో యో నిత్యం నజయతితరాం కోపి పురుషః॥ 75

వంశభవో గుణవానపి
సఙ్గవి శేషేణ పూజ్యతే పురుషః
నహి తుంబీఫల వికలో
వీణాదణ్డః ప్రయాతి మహిమానమ్॥ 76

అమితగుణోపి పదార్థో
లోకే దోషేణ నిన్దితో భవతి
నిఖిల రసాయన మహితో
గన్ధేనోగ్రేణ లశున ఇవ ॥ 77

ఉపకారమేవ తనుతే
విపద్గతః సద్గుణో నితరామ్
మూర్ఛాగతో మృతోవా
నిదర్శనం పారదోత్ర రసః 78

వనా న్తః ఖేల న్తీ శశకశిశు మాలోక్య చకితా
భుజప్రా న్తం భర్తుః సపది భయహ ర్తు ర్విశతి యా
అహో సేయం సీతా దశవదన నీతా హలరదైః
పరీతా రక్షోభిః శ్రయతి వివశా కామపి దశామ్ ॥ 79

శా. తనకార్యంబు పరార్థమైవిడుచు, సత్యంతం బభేదైక్యభా
వనముం సజ్జనులందుఁదాల్చు, సతమున్ స్వాభావికోత్సాహితో
న్మనుఁడై, రమ్యవదాన్యతా మహిమమందంబందఁ బల్దిష్టయై,
తనరు న్నిత్యమెవండొ, యాసుగుణియే ధన్యుండు మాన్యుండిలన్

క. పురుషుఁడు వంశభవుండున్
వరగుణవంతుఁడును, సంగవశమునఁ బూజ్యో
త్తరుఁడగుఁ, బగిలినకాయం
బరఁగిన యాపీఠెకాఁడ వదయదు మహిమన్॥ 76

క. నిస్తుల గుణములు గలిగిన
వస్తువు నొకదోషమునసె వదయును నిందన్
శస్త్రరసాయనముల స
గ్రస్తవ్యము లశునముగ్ర గంధమున వలెన్ 77

క. మిగుల విపత్తుననేనియు
సుగుణుఁడు మేలేయొనర్చుఁ జూపె; వివశతన్
దగిలిన, భస్మంబైనను
దగురసమగు పారదంబె తార్కాణమిటన్॥ 78

మ. వనమందు న్విహరించుచో శశకడింభంబు న్విలోకించి, భీ
తిని భర్తం భయహర్తఁజేరి శిరమెంతే మూఁపునన్మోవు భూ
తనయా రత్నము రావణుండు గొనిపోఁ, దన్లాంగలాంచద్రదల్
దనుజల్ చుట్టునుగొల్వ, విహ్వలత మెల్లండాలెఁగా యక్కటా!॥

పురా గీర్వాణానాం నిజ భుజ బలాహో పురుషికా
మహోకారఙ్కారం పురభిది శరం సమ్ముఖయతః
స్మరస్య స్వర్బాలా నయన ముఖ మాలార్చనపదం
వపుః సద్యో భాలానల భసిత జాలాస్పద మభూత్ ॥ 80

విష్ణాతోఽపి చ వేదాన్తే
సాధుత్వం నైతి దుర్జనః
చిరం జలనిధౌ మగ్నో
మైనాక ఇవ మార్దవమ్ ॥ 81

నైర్గుణ్యమేవ సాధీయో
ధిగస్తు గుణగౌరవమ్
శాఖినోఽన్యే విరాజన్తే
ఖణ్డ్యన్తే చన్దనద్రుమాః 82

పరోపసర్పణాః సన్త
శ్చిన్తానల శిఖాశతైః
అచుమ్బితాన్తఃకరణాః
సాధు జీవన్తి పాదపాః 83

శూన్యోఽపి చ గుణవత్తా
మాతన్వానః స్వకీయ గుణ జాలైః
వివరాణి ముద్రయన్ద్రా
గూర్ణాయురివ సజ్జనో జయతి ॥ 84

శా. ఔరా! వేల్పులముందట న్నిజభుజాహంకారతన్ బాణమే
పారన్ దత్పురవైరిపై గుఱిగ నేయంబూను సూనాస్త్రునిస్వ
ర్నారీదృక్పమమాలి కార్చిన సమర్థ ప్రాజ్యదేహంబు భా
లోదుప్రోత్థిత వహ్నిభస్మమునకున్ యోగ్యత్వ మొందెంగదా 80

క. శ్రుత్యంతమున మునింగియు
నత్యంతముఁ గుజనుఁ డెట్టు లతిసుజనుఁడగున్
నిత్యము మైనాకము సం
ప్రత్యయమున వనధి మునిఁగి వడసెనె మృదుతన్॥ 81

క. సాధీయము నైర్గుణ్యమె.
బాధకె యగుఁజూవె సుగుణ వరగౌరవమున్
సాధారణ తరు లలరఁగ
నీధరఁ జందనమహీజమే నలుకఁబడున్॥ 82

క. పర సముపసర్పణాధిక
పరితాపానల శిఖాళి పరిపరి నంతః
కరణము దపులక పాదప
వరములు జీవించు వినుతిభాజనములుగన్॥ 83

గీ. సజ్జనుం డలసాలీడుసరణి. శూన్య
ములను స్వగుణాళి గుణవంతములుగఁజేయు
నెప్పుడును వివరంబులఁ గప్పిపుచ్చు
నట్టివానికి ధ్రువముగ నగు జయంబు॥ 84

ఖల సజ్జన కార్పాస
రక్షణైకహుతాశనః
పరదుఃఖాగ్ని శమనో
మారుతః కేన వర్ణ్యతే ॥ 85

పర గుహ్య గుప్తి నిపుణం
గుణమయమఖిలైః సమీహితం నితరామ్ ॥
లలితామ్బర ఇవ సజ్జన
మాఖవ ఇవ దూషయన్తి ఖలాః ॥ 86

యశః సౌరభ్య లశునః
శాన్తి శైత్యహుతా[illegible]
కారుణ్య కుసుమాకా[illegible]
ఖలః సజ్జనదుఃఖదః ॥ 87

ధత్తే భరం కుసుమ పత్ర ఫ[illegible]వలీనాం
ఘర్మ వ్యథాం వహతి శీతభవాం రుజంచ
యో దేహ మర్పయతి చాన్య సుఖస్య హేతో
స్తస్మై వదాన్య గురవే తరవే నమోస్తు ॥ 88

హాలాహలం ఖలు పిపాసతి కౌతుకేన
కాలానలం పరిచుచుమ్బతి చ ప్రకామమ్
వ్యాలాధిపంచ యతతే పరిరబ్ధుమద్ధా
యో దుర్జనం వశయితుం తనుతే మనీషామ్ ॥ 89

## భా మి నీ వి లా స ము

క. ఖలజనుఁడు సుజన తూలము
నిల రక్షింపంగ నగ్నియే యగుఁజుమి, లాఁ
తుల దుఃఖాగ్ని వెలార్పఁగ
బలితపు మారుతుఁడు, పొగడ వశమే వానిన్ ? 85

క. పరగుహ్యగుప్తి నిపుణుని,
వరగుణు నఖిలాభిలషితుఁ, బరమోత్తమునిన్
దురితాత్ములు దూషింతురు
మురువగు నంబరముఁ జించు మూషికముపలెన్ 86

క. యశమను సౌరభ్యమునకు
లశునము, [illegible]తిశీతలజ్వలనము, ని
ర్విశిష్టకారుణ్య [illegible]
తిశయ నభంబగు [illegible]ండు, ధీదుఃఖుఁడౌ॥ 87

గీ. పరుల సుఖమునకయి, [illegible]మ పత్ర ఫల వి
తాన భరము వహించు, నాతపమహార్తి
హిమభవవ్యాధిఁ గను దేహమే యొసంగు
నలవదాన్యగురుల్, తరువులకు నతులు॥ 88

గీ. కుజనుని వశీకరింపఁగఁ గోరువాఁడు
హాలహాలము నర్మిలిం ద్రావఁ దలఁచువాఁడె,
కాలవహ్నిని ముద్దిడఁ గడఁగువాఁడె॥
భోగిపతిఁ గౌఁగిలింపఁగఁ బూనువాఁడె। 89

దీనా మిహ పరిహాయ శుష్కసస్యా
న్యౌదార్యం ప్రకటయతో మహీధరేషు
ఔన్నత్యం విపుల మవాప్య దుర్మదస్య
జ్ఞాతోయం జలధర తావకో వివేకః ॥ 90

గిరయో గురవ స్తేభ్యో
ప్యుర్వీ గుర్వీ తతోపి జగదణ్డమ్
తస్మా దప్యతిగురవః
ప్రలయే ప్యచలాః మహాత్మానః ॥ 91

వ్యోమని బీజాకురుతే
చిత్రం నిర్మాతి యత్నతః సలిలే
స్నపయతి పవనం సలిలే
యస్తు ఖలే చరతి సత్కారమ్ ॥ 92

హారం వక్షసి కేనాపి
దత్త మజ్ఞేవ మర్కటః
లేఢి జిఘ్రతి సంక్షిప్య
కరో త్యున్నత మాసనమ్ ॥ 93

మలినేపి రాగపూర్ణా
వికసితవదనా మనల్ప జల్పేపి
త్వయి చపలేపి చ సరసాం
భ్రమర కథం వా సరోజినీ త్యజసి ॥ 94

గీ. వారిధర! దీనజనముల వాడువాఱు
పైరులకుఁగాక, నీదు నుదారగుణము
నచలములఁ జూపు. దీదుర్మదాతిశయము
పెంపఁగు బెఱుంగఁబడె. నీవివేక మహహ॥ 90

క. అగములు గురువులు. వానికి
నగు గురు వాపృథివి. దాని కగు జగదండం
బు గురుపు, దానికిఁ గడుగురు
లగుదురు ప్రళయాన నచలులైన మహాత్ముల్। 91

క. అలఁతుల కెవ్వఁడు సత్కృతి
నలుపునో, యాతఁడు విహాయసమ్మున విత్తుఁగా
జలమున జిత్రము వ్రాయఁగ
దలఁకొనుఁ దోయముల మారుతంబును ముంచుఁగా॥ 92

క. అవివేకి యెవ్వదేనియుఁ
దవిలించిన ముత్తెసరముఁ దనవక్షమునఁగా
ల్లవగము గొఱుకును. మూర్కొను.
నవనిం బడవేయు. మీఁద నమరుచు దానిఁగా॥ 93

గీ. మలినుఁడవు నీవు. రాగసంభరిత యామె;
వదరుఁబోఁతీవు. వికసితవదన యామె;
యతిచపలుఁడీవు. సరసయౌ నామె; యట్టి
పద్మినిఁ ద్యజింపనేల? యో భ్రమరవర్య! 94

స్వార్థం ధనాని ధనికాత్ ప్రతిగృహ్ణాతో య
దాస్యం భజేన్మలినతాం కి మిదం విచిత్రమ్
గృహ్ణాన్ పరార్థ మపి వారినిధేః పయోపి
మేఘోయమేతి సకలోపిచ కాలిమానమ్॥ 95

జనకః సానువిశేషో
జాతిః కాష్ఠం భుజఙ్గమైః సఙ్గః
స్వగుణై రేవ పటీరజ
యాతోసి తథాపి మహిమానమ్॥ 96

కస్మై హన్త ఫలాయ సజ్జన గుణ గ్రామార్జనే సజ్జసి
స్వాత్మోపస్కరణాయ చే న్మమ వచః పథ్యం సమాకర్ణయ
యే భావా హృదయం హరన్తి నితరాం శోభాభరైః సంభృతా
స్తై రేవాస్య కలేబర పుషో దైన్యం దినం వర్తతే॥ 97

భిన్నా మహాగిరిశిలాః కరజాగ్ర జాగ్ర
దుద్దామ శౌర్య నికరై కరటి భ్రమేణ
దైవే పరాచి కరిణా మరిణా తథాపి
కుత్రాపి నాపి ఖలుహా పిశితస్య లేశః॥ ౯౮

గర్జిత మాకర్ణ్య మనా
గఙ్కే మాతు ర్నిశార్ధ జాతోపి
హరిశిశు రుత్పతితుం ద్రా
గఙ్గా న్యాకుఞ్చ్యలీయతే నిభృతమ్ ॥ ౯౯

గీ. ధనము ధనికులచెంత స్వార్థంబుకొఱకుఁ
గౌను నరుని మోము కలుషితమును వహించు
ఉబ్రమె పరార్థమయి నీర మంబుధికడఁ
గౌనుసకలుఁ దాఘనుఁడె నల్పు గనును గాదె॥ 95

క. జనకుఁడౌ స్థాణువు, జాతియొ
కనఁ గాష్ఠము, సంగడీండ్రౌ కాకోదరు. లై
నను స్వగుణంబులచేతనె
ఘనతఁ బటీ:జము! నీవు గాంచితి కాదే॥ 96

మ. గుణజాలార్జన మెట్టి మేల్గనఁగఁ జేకూర్పాఁడవో, సజ్జనా
గ్రణి చెప్ప న్విను నామస. ల్కాదియ సంస్కారార్థ మేన్ స్వాత్మకున్
గణనీయాతి మనోజ్ఞ పూర్ణత, హృదాకర్షంబు లేభావల
క్షణముల్, వానవె దేహముం బెనుచుటల్ గా నిత్యవృత్తుల్ కలిన్

గీ. కరటి యను భ్రాంతి దుర్విధిఁ గరివిరోధి
నఖరజాగ్రత్సముత్కటాంచత్పరాక్ర
మాశిఁ జీలుచుఁ బెనుగొందఱాలఁ గాని
యెటను గాంచను పిశిత మింతేని నకట! 98

గీ. హరిశిశువు సగము రాత్రియందు జాతుఁ
డయ్యు గర్జిత మింత విన్నపుడ మాతృ
నంకమున నుత్పతనమంద నతిరయమున
నంగము ల్గడు ముడిచి తానడఁగియుండె॥ 99

కింతీర్థం హరిపాదపద్మభజనం కింరత్న మచ్ఛామతిః
కింశాస్త్రం శ్రవణేన యస్యగలతి ద్వైతాన్ధకారోదయః
కింమిత్రం సతతోపకారరసిక స్తత్త్వావబోధః సఖే
కింశత్రు ర్వద భేదదానకుశలో దుర్వాసనా సఞ్చయః ॥100॥

ఇతి శ్రీ పండితరాజ జగన్నాథ విరచితే
భామినీ విలాసే అన్యోక్తి సముల్లాసః



# భా మి నీ వి లా స ము

సీ. ఏయ్యది తీర్థమౌ ? నిందిరాపతి చర
        ణాంభోరుహంబుల యర్చనంబ,
యెయ్యదిరత్నమౌ ? నెల్లపు డిహపర
        సాధనంబైన యచ్చంపు మతియ.
యెయ్యది శాస్త్రమౌ ? నిలద్వైతతమసోద
        యముఁ జెవిఁ గొని, యాత్మయందిడుటయ,
యెయ్యది సతతోపకృతిసక్తమౌ మిత్ర
        మగును ? దత్త్వావబోధానుభవము,
సఖుఁడ వచియింపుమా : యింక శాత్రవమెదో ?
యమితభేదము నిచ్చుటయందుఁ గుశల
మైన యంతఃకరణముఖాత్యంతనిష్ఠ
దుష్టసంస్కారచయము. యెందునుదలంప॥ 100

భామిని విలాసము అన్యోక్తి సముల్లాసము సమాప్తము

---

శ్రీ శ్రీ శ్రీ



శ్రీః

# భామినీ విలాసః

## శృంగార సముల్లాసః



నమనాగపి రాహు రోష శఙ్కా
సకలఙ్కానుగమో నపాణ్డుభావః
ఉపచీయత ఏవ కాపి శోభా
పరితో భాముని తే ముఖస్య నిత్యమ్॥

నితరాం పరుషా సరోజ మాలా
నమృణాలిని విచార పేశలాని
యది కోమలతా తవాఙ్గకానా
మథ కా నామ కథాపి పల్లవానామ్॥

స్వేదామ్బు సాంద్ర కణశాలి కపోలపాలీ
దోలాయిత శ్రవణ కుణ్డల వన్దనీయా
ఆనన్ద మఙ్కురయతి స్మరణేవ కాపి
రమ్యా దశా మనసి మే మదిరేక్షణాయాః॥

కస్తూరికా తిలకమాలి నిధాయ సాయం
స్మేరాననా సపది శీలయ సౌధమౌలిమ్
ప్రౌఢిం భజన్తు కుముదాని ముదా ముదారా
ముల్లాసయంతు పరితో హరితో ముఖాని॥

శ్రీః

పణ్డితరాజ తిలక జగన్నాథ ప్రణీతః

# భామినీ విలాసము

## శృంగార సముల్లాసము



గీ. రాహు రోషంపు జంకు గోరంతలేక,
బహుళశంకానుగతి లేక, పాండుభావ
మింతయును లేక, త్వన్ముఖకాంతి నిత్య
మల్లుకొనుఁ గాత ! భామినీ ! యెల్లదెసల॥ 1

గీ. తావకాంగక కోమలత్వంబు ముందుఁ
జాలఁ బరుసంబు వారిజమాల, యింక
బిసములో యన్న సామాన్యపేశలములు
పల్లవంబులకత మఱి పలుకనేల ? 2

గీ. అవిరళస్వేదకణశాలి యగు కపోల
పాళి వ్రేలాడు కుండలాభరణ కాంతి
దనరు మదిరేక్షణల రమ్యదశఁ దలంప
నుల్లమున మోద మిగురొత్తకుండు నెట్లు ? 3

గీ. చెలియ ! నుదుటను గస్తూరితిలక మలర
సంజ సౌధముపై స్మితాస్యమున నీవు
చేరఁ, గుముదంబులందు నుదారముదము
చెలఁగి సర్వహారిన్ముఖములు వెలుంగు॥ 4

తన్మఞ్జు మన్దహసితం శ్వసితాని తాని
సా వై కళఙ్క విధురా మధురాననశ్రీః
అద్యాపి మే హృదయ మున్మదయన్తి హన్త
సాయన్తనామ్బుజ సహోదర లోచనాయాః ॥ 5

ప్రాతస్తరాం ప్రణమనే విహితే గురూణా
మాకర్ణ్య వాచ మమలాం భవ పుత్రిణీతి
నేదీయసి ప్రియతమే పరమ ప్రమోద
పూర్ణాదరం దయితయా దధిరే దృగన్తాః ॥ 6

గురుజన భయమ ద్విలోచనాన్తః
సముదయ దాకుల భావ మావహన్త్యాః
దరదళ దరవిన్ద సున్దరం హా
హరిణదృశో నయనం న విస్మరామి ॥ 7

బదరామలకామ్రదాడిమానా
మపహృత్య శ్రియ మున్నతాం క్రమేణ
అధునా హరణే కుచౌ యతేతే
దయితే తే కరిశాబ కుమ్భలక్ష్మ్యాః ॥ 8

కపోలపాలిం తవ తన్వి మన్యే
లావణ్య ధన్యే దిశ ముత్తరాఖ్యామ్
విభాతి యస్యాం లలితాలకాయాం
మనోహరా వైశ్రవణస్య లక్ష్మీః ॥ 9

# స్వామినీ విలాపము

గీ. అకట ! యలనాఁటి సాయంతనాంబుజాత
సోదరాలోక మంద మంజు హసితంబుఁ,
గమ్మయూర్పులు, నిష్కళంకమగు మధుర
వదనరసము, సోఁగియించె నామదిని నిపుడు॥ 5

గీ. ప్రొద్దుపొడువకమును గురువులకు మ్రొక్కి,
'పుత్త్రిపతివగు' — మను వారిపుణ్యవాక్కు
విని, రమణిచెంత వసియించు ప్రియునిఁ బరమ
మోద పూర్ణాదర కటాక్షములను గనియె॥ 6

గీ. గురుజనభయాన, ననుఁ గనుఁగొనఁగ నాత్మ
బొడము విహ్వలభావానఁ జిడిముడిపడు
హరిణలోచన [illegible]దంబుజాత
మంజునయనంబు, [illegible], హా ! మఱువఁజాల 7

గీ. క్రమముగా బదరామలకి ఖల మహిమ,
మామ్రదాడిమములసిరి యపహరించి
కరికలభకుంభలక్ష్మి నిత్తఱిఁ గొనంగ
దయిత ! నీస్తనుదోయి యత్నంబొనర్చు॥ 8

గీ. భాసురాలకహారి, తా వైశ్రవణపు
లక్ష్మి శోభించు నీకపోలస్థలమునఁ,
గాన, నది యుత్తరాఖ్యాగ యౌనటంచు
భావమున నెంతుఁ దన్వి లావణ్యధన్య ! 9

## భా మి నీ వి లా స ః

నీవీం నియమ్య శిథిలా ముషసి ప్రకాశ
మాలోక్య వారిజదృశః శయనం జిహాసోః
నైవావరోహతి కదాపిచ మానసాన్మే
నాభేః ప్రభా సరసిజోదర సోదరాయాః 10

అలీషు కేళీ రభసేన బాలా
ముహు ర్మమాలాప ముపాలపన్తీ
ఆరా దుపాకర్ణ్య గిరం మదీయాం
సౌదామినీయాం సుషమా మయాసీత్॥ 11

ముధైవ మన్తుం పరికల్ప్య గన్తుం
మృషైవ రోషా దుపజల్పతో మే
ఉదశ్రు చక్షు న్నయనాం నతాఙ్గీ
గిరం న కాం కాముదరీ కరోతి ॥ 12

తదవధి కుశలీ పురాణ శాస్త్ర
స్మృతి శత చారు విచారజో వివేకః
యదవధి నపదం దధాతి చిత్తే
హరిణ కిశోర దృశో దృశోర్విలాసః 13

ఆగతః పతి రితీరితం జనైః
శృణ్వతీ చకిత మేత్య దేహలీమ్
కౌముదీవ శిశిరీ కరిష్యతే
లోచనే మమ కదా మృగేక్షణా॥ 14

గీ. వేఁకువను వెల్గుఁ గని జాఱుపోఁకముడిని
పడి బిగించుచుఁ బానుపు విడువ నెంచు
నంబుజాక్షి సరసిజోదరాభ నాభి
శోభ నామానసము విడుచునో కొ, యకట! 10

గీ. బాల, సకియలతోఁ గేలిపరత నుండి
పలుమరు న్నాదుమాటలె పలుకుచోట
దండ నాగొంతు విన్న తత్క్షణమ తాల్చె
నమల సౌదామినీ సుషమాతిశయము 11

గీ. వట్టితప్పు ఘటించి కోపమునఁ 'జనుదు'
నంచు నూరకె బెదరింప నశ్రువారి
నించి చంచలలోచన నేవచించు
సరణి నెదియేని చేయంగ సమ్మతించె 12

గీ. ఎంతదాఁక వివేకి తా నెదను హరిణ
శాబలోచన దృగ్విలాసమున. కెర, మొ
సంగఁ, దందాఁకనె పురాణశాస్త్రవేద
శతసమగ్రవిచారణచతురుఁ డవని॥ 13

గీ. 'చెలువుఁ డిదె వచ్చె' నని చెలు ల్వలుకఁగఁ, వివి
యపుడు, దడఁబడు నడల దేహళికి వచ్చి,
కౌముదింటలె నావిలోకనయుగంబు
నెపుడు శిశిరమొనర్చు నాయేణనయన॥ 14

అపధౌ దివసావసాన కాలే
భవనద్వారి విలోచనే దధానా
అవలోక్య సమాగతం తదా
మా మథ రామా వికసన్ముఖీ బభూవ ॥ 15

వక్షోజాగ్రం పాణినా స్పృశ్య దూరం
యాతస్య ద్రాగాననాబ్జం ప్రియస్య
శోణాగ్రాభ్యాం భామినీ లోచనాభ్యాం
జోషం జోషం జోషమేవావతస్థే ॥ 16

గురుభిః పరివేష్టితాపి గణ్డ
స్థల కణ్డూయన చారు కైతవేన
దరవర్తిత హేమ బాహునాళా
మయి బాలా నయనాఞ్చలం చకార ॥ 17

గురు మధ్య గతా మయా నతాఙ్గీ
నిహతా నీరజ కోరకేణ మన్దమ్ ॥
దర కుణ్డల తాణ్డవం నతభ్రూ
లతికం మామవలోక్య ఘూర్ణితాసీత్ ॥ 18

వినయే నయనారుణ ప్రసారాః
ప్రణతౌ హస్త నిరస్త రాశ్రుధారాః
అయి జీవిత సంశయ ప్రయాణే
నహి జానే హరిణాక్షి కేన తుష్యేః 19

# భా మి నీ వి లా స ము

గీ. సంజ, నేనప్పువేళ యెంచగనె యంతి
పురము ద్వారమ్ము వంకఁ జూపులు నిగిడ్చి,
యప్పుడ యరుదెంచు నన్ను నల్లంతఁ గాంచి,
రామ, వికసన్ముఖాంబుజధామ యయ్యె ॥ 15

గీ. పాణిఁ జనుమొన స్పృశియించి వడిగ నవల
కరుగు ప్రియు మోముదమ్మి శోణాగ్రములగు
వనుల, భామిని, పుల్కుపుల్కునను గనుచు
నిలిచె, స్మరదీపన మదంపఁ దలముగామి॥ 16

గీ. తాను గురుజన పరివేష్టమాన యయ్యు
గండకండూయన మనోజ్ఞ కైతవమున,
బాల, వరదర్శిత సువర్ణ బాహునాళ
యగుచు నాపయి విడె నయనాంచలంబు॥ 17

గీ. అలరి గురుమధ్యగత యానతాంగి కింత
దగులఁ దిన్నఁగ, నేఁ దమ్మిమొగడ నేయ
నల్లన గమ్మలూఁగ, నిట్టటు, బొమలత
ముడిచి, కంపితయయి "చూడఁదొడఁగె నన్ను॥ 18

గీ. వినయమును బాపఁ గనులు గావిని వహించు
మ్రొక్క నెరపక కన్నీటిబొట్లు దొరల
వయనము బూనఁ బ్రాణసంశయము గలుగు
నకట! నీకెందు ముదమౌ? మృగాక్షి! యొఱుఁగ, 19

## భా మి నీ వి లా సః

అకరుణ మృషా భాషాసిన్ధో విముఞ్చ మామఞ్చలం
తవ పరిచితః స్నేహః సమ్య ఙ్మయే త్యభిధాయినీమ్
అవిరళ గళద్బాష్పాం తన్వీం నిర స్త విభూషణాం
క ఇహ భవతీం భద్రే నిద్రే వినా వినివేదయేత్ ॥ 20

తీరే తరుణ్యా వదనం సహాసం
నీరే సరోజంచ మిలద్వికాసమ్
ఆలోక్య ధావ త్యుభయోత్ర ముగ్ధా
మరన్ద లుబ్ధాలి కిశోర మాలా ॥ 21

పీక్ష్య వక్షసి విపక్షకామినీ
హారలక్ష్మ దయితస్య భామినీ
అంసదేశ వినివేశితం క్షణా
దాచకర్ష నిజ బాహు వల్లరీమ్॥ 22

దరానమత్కంధరబన్ధ మీష
న్నిమాలిత స్నిగ్ధ విలోచనాబ్జమ్॥
అనల్ప నిఃశ్వాస భరాలసాఙ్గం
స్మరామి సఙ్గం చిర మఙ్గనాయాః ॥ 23

రోషావేశా న్నిర్గతం యామయుగ్మా
దేత్య ద్వారం కాంచిదాఖ్యాం గృణ న్తమ్
మామాజ్ఞాయై వా ధ్యయౌ కాతరాక్షీ
మన్దం మన్దం మన్దిరాదిన్దిరేవ ॥ 24

# భా మి నీ వి లా స ము

మ. సకియా! భద్రపునిద్ర నల్గి నను 'నిష్కారుణ్యవేషా! మృషా
ధిక భాషామయ సింహ! పైఁటకొన నెంతేవీడు, నీమైత్రి యిం
త్యకసలెన్సన్ గనుగొంటి నేనని కడుం దళ్కొత్తుకన్నీ టఁ దద్య
క్తలాపాంచిత యైన తన్విఁ దెలుపంగా, నీవె గా తేరిఁకన్ 20

గీ. రమణి చిఱునవ్వు మోము తీరంబునందుఁ
గ్రమవికసితాంబుజంబు నీరంబునందు,
నరసి, భ్రాంతి మరందలుబ్ధాలిశాల
పంక్తి యిరుపంకలకుఁగూడఁ బర్వువాఱు॥ 21

క. పరకామిని హారపు గుఱు
తరసి ప్రియోరమున, నతని యంసస్థలి సుం
దరముగ మోపిన భుజవ
ల్లరి వేగఁ లాగికొనెఁ గలంగుచు నాత్మన్॥ 22

గీ. స్వల్పతర నమత్కంధర బంధనంబు
అఱమొగిర్చిన స్నిగ్ధ నేత్రాంబుజంబు
అధిక నిశ్శ్వాస భారాలసాంగకంబు
నైన సుందరి సంగమ మాత్మ నెంతు! 23

గీ. అదరు కినుక వెదలి, రెండుయామములకు
వచ్చి, మొగసాలఁ జెలికిఁ గోపముకతంబుఁ
బలుకునప్పుడు. లోనుండి తెలిసి యటకు
లక్ష్మివలెఁ జకితాక్షి మెల్లఁగను జేరె! 24

## భా మి నీ వి లా స ః

హృదయే కృత శైవలానుషఙ్గా
ముహురఙ్గాని యత స్తతః క్షిపన్తీ
ప్రియనామపరే ముఖే సఖీనా
మతిదీనా మయ మదధాతి దృష్టిమ్ ॥ 25

ఇత ఏవ నిజాలయం గతాయా
వనితాయా గురుభిః సమావృతాయాః
పరివర్తిత కంధరం నతభ్రూ
స్మయమానం వదనామ్బుజం స్మరామి॥ 26

కథయ కథమివాశా జాయతాం జీవితే మే
మలయ భుజగ వాన్తా వాన్తి వాతాః కృతాన్తాః
అయమపి ఖలు గుఞ్జ న్మఞ్జు మాకన్దమౌలౌ
చులుకయతి మదీయాం చేతనాం చఞ్చరీకః ॥ 27

నివుద్ధ్య యాన్తీం తరసా కపోతీం
కూజత్కపోతస్య పురో దధానే
మయి స్మితార్ద్రం వదనారవిన్దం
సా మన్దమన్దం నమయాం బభూవ॥ 28

తిమిరం హరన్తి హరితాం పురఃస్థితం
తిరయన్తి తాపమథ తాపశాలినామ్
వదనత్విష స్తవ చకోరలోచనే
పరిముద్రయన్తి సరసీరుహశ్రియః ॥ 29

గీ. మానసంబున, గృతశైవలానుషంగ
మఱుగుమ మాటికి నిటులటు లంగకములు
విభ్రమించుం. బ్రియ నామంబె పేరుకొనెడు
చెలులమోముల దీన వృక్కుల నతి గనె 25

గీ. వినతయై పెద్దలనుగూడి తననివాస
మునకు నేగుచు గంధరమును మలంచి
వ్రాలు కన్నొమ మురువు జిర్నగవు దోప
నన్ను గను సఖిముఖనళినము దలంతు॥ 26

చ. మలయ భుజంగవాంతములు మారుతము ల్సమవర్తిమూర్తులై
మొలసె, రసాలమౌళి నిదిగో, రొదనించుచు జంచరీకముం
గలచెడు నాయచేతన. ముకం దరుణీమణి! యేవిధంబునన్
నిలుపుదు? జీవితంబు నయి నెమ్మది నాస, రవంత చెప్పుమా. 27

గీ. సంగ బరువిడు కలరవతరుణి బట్టి
మత మొనర్చు కపోతంబు మ్రోలనిలిపి
నట్టి నన్ను స్మితార్ద్రాననాంబుజంబు
వంచి, యించుక గాంచె నాచంచలాక్షి! 28

గీ. దిక్కులం, బురఃస్థితంబయి. తిమిరమడచి.
విమ్మటం దపించువారల వేంద్ర నుడిపి,
యంబురుహశోభ ముకుళించు నట్లొనర్చె
నార! త్వన్ముఖకాంతుల్ చకోరనయన! 29

కుచ కలశ యుగాన్త ర్మామకీనం నఖాఙ్కం
సపులక తను మన్దం మన్ద మాలోకమానా
వినిహిత వదనం మాం వీక్ష్య బాలా గవాక్షే
చకిత నత నతాఙ్గీ సద్మ సద్యో వివేశ ॥ 30

విధాయ సా మద్వదనానుకూలం
కపోలమూలం హృదయే శయానా
తన్వీ తదానీ మతులాం బలారేః
సామ్రాజ్యలక్ష్మీ మధరీచకార ॥ 31

ముహురర్థితయా నిద్రయా మే
బతయామే చరమే నివేదితాయాః
చిబుకం సుదృశోర్మృగాని యావత్
మయితావన్మిహిరోపి నిర్దయోభూత్ ॥ 32

శ్రుతిశతమపి భూయః శీలితం భారతం వా
విరచయతి తథానో హన్త సన్తాపశాన్తిం
అయిసపది తథాయం కేలివిశ్రాన్తి కాన్తా
వదన కమల విర్యత్కాన్తి సాన్ద్రోసకారః ॥ 33

లవలీం తవలీలయా కపోలే
కవలీ కుర్వతి కోమల త్విషా
పరిపాండుర పుండరీకఖణ్డే
పరిపేతుః పరితో మహోధయః ॥ 34

చ. కుచకలశద్వయాంతర నిగూఢ మదీయ నఖక్షతంబుఁ గాం
చుచు మెలమెల్లఁగన్, బులకశోభిత రమ్యశరీర, బాల, దా
నచటి గవాక్షమందు నిహితానను నన్గని విస్మిత
ప్రచుర నతాంగియై నిజనివాసము నప్పుడ సొచ్చె సిగ్గునన్॥ 30

గీ. నాదు వదన సమీపమునం గపోల
మూలముం జేర్చి యుక్కున ప్రాలుతన్వి
యంద మయ్యెడ ససముమౌ నాశవీడు
ప్రాజ్యసామ్రాజ్యలక్ష్మిఁ దిరస్కరించు॥ 31

గీ. విపరిణామున నాకడఁ జేర్చఁబడిన
సుదృశ నిద్రితయగుసతి చుబుకమెత్తి
పలుమఱుం బుజ్జగించు నావలన నేఁడు
సూరుఁడును నయ్యెయో! కడుఁ గ్రూరుఁడయ్యె॥ 32

గీ. మదన కదనాన బడలిక గదిరినట్టి
కాంతకాంతి భరాస్య పంకజము నుండి
వెడలెడు 'సహార' మట్లు, నాయెడఁదకొసఁగ
దెలిమి, శ్రుతిశత ధారతముల విమస్య॥ 33

గీ బాల! నీదు కపోలము, లీల లవలి
యందపుం జిగిగ్రమింగు, మహోభులెల్ల
పరగఁ బరిపాండుర సితాంబుజములగముల
చుట్టునెల్లెడ నాశ్రయించును నిజంబు॥ 34

యౌవనోద్గమ నితాన్తశఙ్కితాః
శీల శౌర్య బల కాన్తి శోభితాః
సంకుచన్తి వికసన్తి రాఘవే
జానకీ నయన నీరజ శ్రియః ॥ 35

అధిరోప్య హరస్య హస్త చాపం
పరితాపం ప్రశమయ్య బాన్ధవానామ్
పరిణేష్యతి వా నవా యువాయం
నిరపాయం మిథిలాధినాథపుత్రీమ్॥ 36

భుజపఞ్జరే గృహీతా
నవపరిణీతా వరేణ రహసి వధూః
తత్కాలజాల పతితా
బాలకురఙ్గీవ వేపతే నితరామ్॥ 37

ఉపనిషదః పరిపీతా
గీతాపిచ హన్త మతిపథం నీతా॥
తదపి న హా విధువదనా
మానస సదనాత్ బహిర్యాతి॥ 38

అకరుణహృదయ ప్రియతమ
ముఞ్చామి త్వా మితఃపరం నాహమ్
ఇత్యాలపతి కరామ్బుజ
మాదాయాలీజనస్య వికలా సా॥ 39

## భా మి నీ వి లా స ము

గీ. చారుతర యౌవనోద్గమ శంకితములు
శీలశౌర్యబలప్రభా లాలసములు
మైథిలీదేవి నేత్రపద్మములు రాము
నందు ముకుళించు వికసించు నౌర! చెలియ! 35

క. హరువిల్లెక్కిడి స్వజనుల
పరితాపం బుడిపి ధరణిపతి సుతుఁ డిపుడీ
నిరపాయ న్మిథిలేశ్వర
వరపుత్త్రిం బెండ్లియాడఁ బడయునొ? లేవో? 36

గీ. వధువు నూతనపరిణీత వరుని బాహు
పంజరంబున నేకాంత పరిగృహీత
చాల కంపంబునొందుఁ దత్కాలజాల
పతితయగు బాలసారంగివలెఁ గలంగి॥ 37

గీ. సరగఁ బఠిపీతము లుపనిషత్తులెల్ల
గీతయును మతిపథమున నీతమయ్యెఁ
గాని, మానససదనంబు మాని వెడలి
బయటికిఁ రాదుగా విధువచన యకట! 38

క. వికలమతి గలిగి సతి, తన
సకియ కరాంబుజముఁ గేలఁ జయ్యనఁ గొని 'యో
యకరుణహృదయా! ప్రియతమ!
నిఁక విడువంజాల నిన్ను నే' - నని పలికెఁ॥ 39

లోభాద్వరాటికానాం
విక్రేతుం తక్రమానిశ మటన్త్యా
లబ్ధో గోపకిశోర్యా
మధ్యే రథ్యం మహేన్ద్రనీలమణిః॥ 40

రూపారుచిం నిరసితుం
రసయన్త్యా హరిముఖస్య లావణ్యమ్
సుదృశః శివశివ సకలే
జాతా సకలేవరే జగత్యరుచిః ॥ 41

గరిమాణ మర్పయిత్వా
లఘిమానం కుచతటా త్కురఙ్గదృశామ్
స్వీకుర్వాతే నమస్తే
యూనం ధైర్యాయ నిర్వివేకాయ॥ 42

నిఃసీమ శోభా సౌభాగ్యం
నతాఙ్గ్యా నయనద్వయమ్
అన్యోన్యాలోకనానన్ద
విరహాదివ చఞ్చలమ్ ॥ 43

నయనాఞ్చలావమర్శం
యా న కదాచిత్పురా సేహే
ఆలింగితాపి జోషం
తస్థౌ సా గన్తుకేన దయిదేన॥ 44

గీ. లోభబుద్ధి వరాటికల్ గూర్పనెంచి,
పెరుగు నమ్ముచు స్వేచ్ఛగఁ దిరుగులాడు
పల్లవప్రమదామణి కల్ల మార్గ
మధ్యమందునఁ ద్రిదశేంద్రమణి లభించె॥ 40

క. పరభూపారుచి దొరఁగఁగ
హరిముఖలావణ్యరసము నానెడు నామం
దురపృశ కేర్పడె సకళే
బర జగమఖిలమున, శివశివా! యరుచి కడుణా॥ 41

గీ. హరిణలోచన కుచతటి కర్పణంబు
సలిపి గరిమాణమును దానివలన లఘిమ
స్వీకరించిన యువ నిర్వివేక ధైర్య
మునకు నీకొనరించెదఁ బ్రణతిశతము! 42

గీ. పాఁడమెఱుఁగవి కాంతి సౌభాగ్యమునకు
దావలంబగు తన్వి నేత్రద్వయంబు
నొందెఁ జంచలభావ మన్యోన్య దర్శ
న మహదానంద విరహంబుననొ, యనంగ॥ 43

గీ. నయనాంచలావమర్శపు
నియతిని మును నోర్వనట్టి నెలఁత ప్రవాసా
శ్రయుఁడయి యేఁగెడుప్రియుఁడెం
తయుఁ గౌఁగిటఁ జేర్చినను సుదాత్తత నుండెణ॥ 44

మానపరా గ్వదనాపి ప్రియా
శయనేవ దయిత కరకమలే
ఉద్వేల్ల ద్భుజ మలసగ్రీవా
బంధం కపోల మాధత్తే॥ 45

కిం జల్పసి ముగ్ధతయా
హన్త మమాఙ్గం సువర్ణ మితి
తద్యపి పతతి హుతాశే
హుతాశే తులాం తవారోహేత్॥ 46

లోచన ఫుల్లాంమ్భోజ ద్వయ
లోభాన్ధైకలైక మనాః
కస్తూరీ తిలక మిషాదయ
మలికేలి స్తవోల్లసతి॥ 47

చిన్తా మీలిత మానసో మనసిజః సఖ్యో విహీన ప్రభాః
ప్రాణేశః ప్రణయాకులః పునరసావాస్తాం సమస్తాకథా
ఏతస్త్వాం ప్రతిబోధయామి మమచే దుక్తిం హితం మన్యసే
ముగ్ధే మాకురు మానమాననమిదం రాకాపతి ర్ద్వేష్యతి॥ 48

అలంకర్తుం కర్ణౌ భృశ మనుభవన్త్యా నవరుజం
ససీత్కారం తిర్య గ్వలిత వదనాయా మృగదృశః
కరాబ్జ వ్యాపారా నతి సుకృతసారా న్రసయతో
జనుస్సర్వశ్లాఘ్యం జయతి లలితోత్తంస భవతః॥

గీ. అమిత మాన పరాఙ్ముఖి యయ్యు, ననుఁగు
చెలియ యుద్వేల్లభుజయు, నత్యలసకంఠ
బంధయును నయి, సెజ్జనుబండి, కేలుఁ
దమ్మిని గపోలతలమునఁ దాల్చియుండె॥ 45

గీ. నాదుతనువు సువర్ణవర్ణం బటంచు
సజ్జతను వదరంగ నేలా? పడంతి!
యది హతాశ, హుతాశనమందుఁ బడిన
సమమగునొ యేమొ నీ శరీరమున కింత॥ 46

గీ. కనులు, విచ్చిన కమలయుగం బటన్న
లోభమున, నెందు వ్రాలఁ బాల్పోక, ముందు
వెనుకలం గనుతేఁటి, నీ గొనబునుదుటఁ
జెలఁగెఁ, గమ్మని కస్తురి తిలక మట్లు॥ 47

గీ. కంతుఁడు చింతఁదాల్చెఁ, జెలికత్తెలు వెల్వెలనైరి, నీప్రియుం
డెంతొ కలంగెఁ, బెక్కులిఁక నేల?, హితంబని నాదుపల్కు నీ
వెంతువయేని, ముగ్ధ!, వినుమీ, కడురోష కళంకితాస్య మా
నాంతమొనర్చు పూర్ణతుహినాంశుని యాటలు సాగనీకుమా॥ 48

మ. లలితోత్తంసమ! నిజ శ్రుతిద్వయిని దాల్పం బల్ శ్రమంబందెడిన్
వలితాస్యం బటు త్రిప్పి సీత్కృతిఁ గరాబ్జవ్యాపృతిం జేసెడిన్,
జలితైణేక్షణ; భూరిపుణ్యఫల మాస్వాదించు నీభాగ్యమున్
దలఁపన్ శక్యమె? త్వత్సమస్త జనవే స్తవ్యంబు ధన్యంబగున్

ఆయాతైవ నిశా నిశాపతికరైః కీర్ణం దిశామన్తరం
భామిన్యో భవనేషు భూషణగణై రఙ్గా న్యలంకుర్వతే
ముగ్ధే మాన మపాకరోషి న మనా గద్యాపి రోషేణ తే
హా హా బాల మృణాళతో ప్యతితరాం తన్వీ తనుస్తామ్యతి॥ 50

వాచో మాఙ్గళికీః ప్రయాణసమయే జల్పత్యనల్పం జనే
కేలీమన్దిర మారుతాయనముఖే విన్యస్త వక్త్రామ్బుజా
నిఃశ్వాస గ్లపితాధరం పరిపత ద్బాష్పార్ద్ర వక్షోరుహా
బాలా లోలలోచనా శివశివ ప్రాణేశ మాలోకతే॥ 51

దారిద్ర్యం భజతే కలానిధి రయం రాజాధునా మ్లాయతి
స్వైరం కైరవ కాననేషు పరితో మాలిన్య మున్మీలతి
ద్యోతన్తే హరిద న్తరాణి సుహృదాం బృన్దం సమానన్దతి
త్వంచే దఞ్చసి కాఞ్చనాఙ్గి వదనామ్భోజే వికాసశ్రియమ్. 52

పాటీరద్రు భుజఙ్గపుఙ్గవ ముఖా యాతా ఇవా తాపినో
వాతా వాన్తి దహన్తి లోచన మమీ తామ్రా రసాలద్రుమాః
ఏతే హన్త కిరన్తి కూజిత మయం హాలాహలం కోకిలా
బాలా బాలమృణాల కోమలతనుః ప్రాణా న్కథం రక్షతు॥ 53

ఆయాతైవ నిశా మనో మృగదృశా మున్నిద్ర మాతన్వతి
మానో మే కథ మేష సంప్రతి నిరాతఙ్కం హృది స్థాస్యతి
ఊహాపోహ మిమం సరోజనయనా యావ ద్విధత్తేతరామ్॥
తావ త్కామ నృపాతపత్ర సుషమం బిమ్బం బభాసే విధోః॥ 54

# భా మి నీ వి లా స ము

ఉ. రాతిరి యేగుదెంచె. నుడురాట్కరముల్ హరిదంతరంబులన్
బూఁతలు పూసె, భామినులు భూషణముల్ ధరియించి రిండ్ల, రో
షాతిశయంబు వీడ విసుమంతయు, నింకను, దాన నేమగున్?
లేఁత బిసంబుకన్నఁ దరుణీ! కృశమౌ మెయిచిక్కె నక్కటా!

శా. ప్రాణేశుండు ప్రయాణమౌనెడఁ, గడున్ స్వస్త్యుక్తులన్ బంధుసం
ఘానన్ వాకొనుఁ, గేళిమందిర గవాక్ష న్యస్త వక్త్రాబ్జమున్
గ్లానిం జెందఁగ మోవియూరుపుల, పక్ష్మోణంబులుం బాష్పధా
రానీకంబున ముగ్గ, బాల, కనె లోలాలోకనాళిం గటా! 51

ఉ. బంగరుబొమ్మ! నీవు ముఖవారిజ మందు వికాసలక్ష్మిఁ బా
త్వం, గని, లేమిఁ గీడ్వడుఁ గళానిధి, పున్నమ పోలునప్డ, యెం
డుం గడునీలిమం గలుపతోఁట లలర్చు, దిగంతరంబు లు
ప్పొంగును గాంతితోఁ, జెలఁగు మోదము నిండ సుహృజ్జనంబులున్

మ. మలయజ సర్పరాణ్ముఖ సమాగతిము ల్గడు వేడిగాడుపుల్
ములసె. రసాలముం జివురులం దగు నెఱ్ఱనికంటఁ గాల్చెదున్,
హాలహల కూజితంబు నిదె యాపక కోయిల చల్లె, బాల, యీ
లలిత మృణాళ కోమలి కలంగక యెట్లసువుల్ భరించు హా! 53

శా. "రేయున్వచ్చె మృగాక్షి మానసము నుద్రేకింప నున్నిద్రతన్,
నా యుల్లం బభిమాన శంకవిడి యీ నాఁడెట్లు లోప్పారు?" నం
చాయబ్జాంబక యూహసల్పె నెపు డష్టాతామదేవాతప
త్రాయత్కాంతిని నిండుబింబ మతిహృద్యంబై వెలింగెం గడున్॥

ప్రభాత సమయ ప్రభాం ప్రణయిని హ్రియా[illegible]రిసా
దముష్య నిజపాణినా దృశ ముకుల [illegible]
అయంతు ఖలు పద్మినీ పరిమలాలి పాటచ్చరై
రవే రుదయ మధ్యగా దధికచారుతై ర్మారుతైః ॥ 55

విదూరా దాశ్చర్య స్తిమిత మథ కించి త్పరిచయా
దుదఞ్చ చ్చాఞ్చల్యం తదను పరితః స్ఫారితరుచి
గురూణాం సంఘాతే సపది మయి యాతే సమజని
త్రపా ఘూర్ణత్తారం నయనయుగ మిన్దీవరదృశః ॥ 56

కపోలా పున్మీల త్పులకనికురమ్బౌ మయి మనాక్
మృశత్యన్తః స్మేర స్తబకిత ముఖామ్భోరుహరుచః
కథం కారం శక్యాః పరిగదితు మిన్దీవరదృశో
దశద్ద్రాక్షా నిర్యద్రస భర సపక్షా భణితయః ॥ 57

రాజానం జనయాం బభూవ సహసా జైవాతృకత్వంతు [illegible]ః
సోయం కుణ్ఠిత సర్వశక్తి విభవో జాతో జరాతో విధిః
సంప్రత్యున్మద ఖఞ్జరీటనయనా వక్త్రాత్రియ నిత్యశ్రియే
దాతా రాజ్య మఖణ్డమస్య జగతో ధాతా నవో మన్మథః ॥ 58

ఆవిర్భూతా యదవధి మధుస్యన్దినీ నన్దసూనోః
కాన్తిః కాచి న్నిఖిలనయనాకర్షణే కార్మణజ్ఞా
శ్వాసో దీర్ఘ స్తదవధి ముఖే పాణ్డిమా గణ్డమూలే
శూన్యావృత్తిః కులమృగదృశాం చేతసి ప్రాదురాసీత్ ॥ 59

# భామినీవిలాసము

మ. సురతాసక్తిఁ, బ్రభాత దీధితి నిజేశుం జూడనీకుండ, సుం
దరి, లీలం దనపాణిఁ దన్నయనముల్ గప్పంగ, నాతండు, తా
మరసామోదతతిన్ హరించి, కడు రమ్యంబౌ గతి న్వీచుతె
మ్మెరలన్ వేఁకువ యౌ టెఱింగెఁ, బ్రియభామిన్యుద్యమం బేపఱన్

చ. తొలితొలి నే విహారమున దోఁప వితాకు విచేష్టఁదాల్చె, న
వ్వలఁ గనె నంచిత ప్రచుర భావముఁ, బిమ్మట విస్తరించె ది
క్కులఁ, నట నే గుణప్రతతిఁ గూడిన తన్ గదియం జనన్, ద్రపా
విలపుఁ గనీనికల్ వెలుఁగె భీతకురంగజ నేత్ర చూపులన్? 56

చ. పులకలచేఁ జెలంగెడు కపోలములన్ స్పృశియించునప్డు, లో
పలి చిఱునవ్వుతో స్తబకభావముఁ గన్న ముఖాంబుజప్రభన్
గలయుచు చల్లు చూపులఁ దెగ న్విఱిఁబండిన ద్రాక్షనుండి చి
ప్పిలు రసమొప్పఁ బల్కు సతి పేశలవాక్కుల నెంచ శక్యమే? 57

మ. విపులం గుంఠిత సర్వశక్తివితతిం బెంపేది, వార్ధక్యమం
దవిచారుం డయి, రాజుగా నలిపె, విశ్వబ్రహ్మ, జైవాతృకా!
నవలోకాంచితజాత మన్మథుఁ డఖండ ప్రాజ్యరాజ్యంబు, ని
త్యవిభూతిం, గన మత్తఖంజ దృశ పక్ష్మాక్షిష్టాన కిచ్చె న్వడిన్॥ 58

శా. ఎందాఁకన్ మధుమాధకంబు, నిఖిలప్రేమావశీకార క
ర్మం బీవ్యజ్ఞము, నందనందనుని కుంభత్కాంతి శోభించునో;
యందాఁకన్ సులజ్జైకలోచనల యాస్యంబందు నిట్టూర్పుచాల్
క్రందౌఁ; బాండిమ చెక్కులం దెసఁగు నిర్వ్యాజపాఠ మెచ్చున్మదిన్

ప్రసఙ్గే గోపానాం గురుషు మహిమానం యదుపతే
రుపాకర్ణ్య స్విద్య త్పులకిత కపోలా కులవధూః
విషజ్వాలాజాలం ఝటితి వమతః పన్నగపతేః
ఫణాయాం సాశ్చర్యం కథయతి తరాం తాణ్డవవిధిమ్॥ 60

కైశోరే వయసి క్రమేణ తనుతామాయాతి తన్వ్యాః స్తనా
వాగామి న్యఖిలేశ్వరే రతిపతౌ తత్కాల మస్యాజ్ఞయా
ఆస్యే పూర్ణశశాఙ్కతా నయనయో సాదాత్మ్య మమ్భోరుహాం
కిఞ్చాసీదమృతస్య భేద విగమః సాచిస్మితే తాత్త్వికః 61

శయితా శైవలశయనే
సుషమా శేషా నవేన్దులేఖేవ॥
ప్రియ మాగతమపి సవిధే
సత్కురుతే మధురవీక్షణై రేవ॥ 62

విరహేణ వికలహృదయా
విలపన్తీ దయిత దయితేతి
ఆగత మపి తం సవిధే
పరిచయహీనేవ వీక్షతే బాలా॥ 63

అధరద్యుతి రస్తపల్లవా
ముఖశోభా శశికాన్తిలఙ్ఘినీ
తనుమప్రతిమా చ సుభ్రువో
న విధేరస్య కృతిం వివక్షతి॥ 64

చ. యమపతి, చిత్రలీలల మహత్త్వ విశేషము గొల్లలెల్లఁ గో
పికలకడ న్వచింప, విని స్వేదముఁ బుల్కలు గండమండలిన్
గమర, విసంపు మంటగమి గ్రక్కునఁ గ్రక్కు భుజంగరాట్ఫణా
విదిత రమేశతాండవము వేమఱు సాధ్వి వచించు వింతగన్॥ 60

ఉ. చిన్నతనానఁ దన్వి మెయిచిక్కి క్రమంబున సర్వనేతృతం
గన్నరతీశునందు నెసఁగన్, దవినుజ్ఞను బూర్ణిమాశశాం
కోన్నతి మోమునన్, జలరుహోపమ మక్షియుగంబునన్, సుధా
సన్నుత మందహాసమునఁ జారుతరంబుగ నొప్పెనెంతయున్॥ 61

గీ. అతివ, శైవల తల్పంబునందు, సుషమ
మింత శోషించినదయి, నవేందురేఖ
యనుపునం బండి, ప్రియుఁడు చేరినను జెంత
సన్మధుర వీక్షణములనె సత్కరించె॥ 62

గీ. బాల, విరహాన విహ్వలభావ యగుచుఁ
జెంత కేతెంచియున్నను గాంతు నపులఁ
బరిచయ విహీనవలెఁ గాంచి పలవరించు
"దయిత, దయిత"-యటంచు నత్తరుణమందు॥ 63

గీ. అలప్రవాళము హసియించు నధరకాంతి
శశివికాసము మించు నాస్యంబుసుషమ
మప్రతిమమైన దీతను వావిధాత
చేసినదియంచు నుప్రభు! నేఁ జెప్పఁజాల॥ 64

వ్యత్యస్తం లపతిక్షణం క్షణ మహో మౌనం సమాలమ్బతే
సర్వస్మిన్విదధాతి కిఞ్చవిషయే దృష్టిం నిరాలమ్బనామ్॥
శ్వాసం దీర్ఘ మురీకరోతి నమనా గఙ్గేషు ధత్తే ధృతిం
వైదేహీ విరహవ్యథా వికలితా హా హన్త లఙ్కేశ్వరః 65

ముఞ్చతి నాద్యాపి రుషం
భామిని ముదిరాలి రుదియాయ
ఇతి సుదృశః ప్రియవచనై
రపాయి నయనాబ్జ కోణ శోణ రుచిః ॥ 66

ఆలోక్య సున్దరి ముఖం తవ మన్దహాసం
నన్దన్త్యమన్ద మరవిన్ద ధియా మిలిన్దాః
కించాసితాక్షి మృగలాఞ్ఛన సమ్భ్రమేణ
చఞ్చూపుటం చటులయన్తి చిరం చకోరాః ॥ 67

స్మితం నైతత్కిన్తు ప్రకృతి రమణీయం వికసితం
ముఖం బ్రూతే కోవా కుసుమ మిద ముద్యత్పరిమలమ్
స్తనద్వన్ద్వం మిథ్యా కనకనిభ మేతత్ఫలయుగం
లతా రమ్యా సేయం భ్రమరకులనమ్యా న రమణీ ॥ 68

సంగ్రామాఙ్గణ సంముఖాహత కియ ద్విశ్వంభరాధీశ్వర
వ్యాదీర్ణీకృత మధ్యభాగ వివరో న్మీలన్నభో నీలిమా
అఙ్గారప్రకరైః ఖరైః కవలయన్నేతన్మహీమణ్డలం
మార్తణ్డోయ ముదేతి కేన పశునా లోకే శశాఙ్కీకృతః ॥ 69

చ. తడఁబడఁ బల్కు నొక్కతె, తలఁ దాలుచు నొక్కతె వెంతొ మౌన మె
ల్లెడఁ గను నొక్కతె, మఱి యేదియొ చూచు నొకర్తు, పెద్దగా
నడరెడు నూరుపు ల్విడుచు నంగములం, గనఁడింతయు నా ధృతిన్
గడు విరహ వ్యథా కులతఁ గాంచి, దశాస్యుఁడు సీతపైఁ గటా॥ 65

క. "ఇదిముదిరా శ్యభ్యుదయము
గదె, భామిని! కసలు వదలఁగదె"—యని ప్రేమా
స్పదుఁ డుపలుక, నయనాంబుజ
విదితాంచల శోణకాంతి వీడె సుదృశకున్॥ 66

గీ. సుందరి! మిళిందములు నీదు మందహాస
ముఖముఁ గని యరవిందమన్ బుద్ధి, మిగుల
నలరు. వెన్నెలపులుఁగు, లోయసితనేత్ర!
చంచుపుటి విప్పు హరిణాంక సంభ్రమమున॥ 67

ఉ. నైజ మనోజ్ఞ కాంతి యగునా? స్మితమి ద్యుతి: దివ్యవి
భ్రాజిత పుష్ప మాస్యమని చాకొను నెవ్వఁడు?; మిథ్య దీని వ
క్షోజయుగం బటంట;—కనకంపు ఫలద్వయి గాని; కాంత యే
యోజ విదౌను? తేంట్లగమి యొప్పెడు సొంపగు తీవ గాకిలన్॥

ఉ. సంగరసీమ నగ్రమునఁ జచ్చిన రాజులు చీల్చ, మధ్యమం
దుం గనుపట్టు రంధ్రమున ద్యోతలనీలిమఁ గల్గి, తీవ్రమౌ
నింగల మట్టు రశ్మిల మహాతపముం గబళించు చిట్టులో
ప్పెం గమలాప్తుఁ, డీతని భువిం బఱవెవ్వఁడు చంద్రుఁడం చనున్॥

శ్యామం సితంచ సుదృశో న దృశోః స్వరూపం
కింతు స్ఫుటం గరల మేత దథామృతంచ
నోచేత్కథం నిపతనా దనయో స్తదైవ
మోహం ముదంచ నితరాం దధతే యువానః 70॥

అవిర్మృగోవా నేత్రంవా
యత్ర కించిద్విభాసతే
అరవిన్దం మృగాక్ష్యావా
ముఖం వేదం మృగీదృశః 71

దయితే రదనత్విషాం మిషా
దయితేమీ విలసన్తి కేసరాః
అపిచాలక వేషధారిణో
మకరన్ద స్పృహయాలవోలయః ॥ 72

అనిశం నయనాభిరామయా
రమయా సంమదినో ముఖస్య తే
నిశి నిస్సరదిన్దిరం కథం
తులయామః కలయాపి పఙ్కజమ్ ॥ 73

అంగైః సుకుమారతరైః సా
కుసుమానాం శ్రియం హరతి
వికలయతి కుసుమబాణో
బాణాలీభి ర్మమ ప్రాణాన్ ॥ 74

# భా మి నీ వి లా స ము

గీ. హరిణనయనాక్షి రూపముల్ శ్యామసితము
లగుట, గరళామృతములె ప్రత్యక్షమిద్ది;
కానిచో, వాని కగ్గమై రేవి, యువత
సమితి యేగతి మోహమోదములఁ గాంచు॥ 70

గీ. అరవంత ప్రకాశించునది భ్రమరమొ,
కాక హరిణమొ, కాకున్న కాంతచూపొ;
అదిగొ! యావెలింగెడునది యంబుజంబొ,
కాక యేణాంకుఁడో, కాక గళితమోమొ॥ 71

క. నీరదనకాంతిమిష నొ
ప్పారుం గేసరములవ్వి, భ్రమరంబులు శృం
గారాలక వేషముఁ గొని
చేరెన్ మకరంద వాంఛచే నిటు, దయితా! 72

క. నిరతము నయనమనోజ్ఞపు
సిరిచే నామోదమగుచుఁ జెలఁగెడు నీసుం
దర వదనకళకు, నిశ ని
స్సరదిందిరవంకజంబు సరిపోలునొకో! 73

క. సుమముల సిరి హరియించిన
రమణీ లలితాంగముల శరంబులుగాఁ దా
నమరిచి మదనుఁడు నాప్రా
ణములం గడువికలముల నొనర్చెడి హితుఁడా 74

ఖిద్యతి సా పథి యాన్తీ
కోమలచరణా నితమ్బభారేణ
ఖిద్యామి హన్త పరితః
తద్రూప విలోకనేన వికలోహమ్ ॥ 75

మథురా గమనోన్ముఖే మురారా
వసుభారాతి భృతాం వ్రజాఙ్గనానామ్
ప్రలయ జ్వలనాయతే స్మరాకా
భవనాకాశ మజాయతామ్బురాశిః॥ 76

కేలీమన్దిర మాగతస్య శనకై రాలీ రపాస్యేఙ్గితైః
సుప్తాయాః సరుషః సరోరుహదృశః సంవీజనం కుర్వతః
జానన్త్యా ప్యనభిజ్ఞయేవ కపట వ్యామీలితాక్ష్యా సఖి
శ్రాన్తాసీ త్యభిధాయ వక్షసి తయా పాణి ర్మమాసఞ్జితః॥ 77

మాన్థర్యమాపగమనం సహశైశవేన
రక్తం సహైవ మనసాధరబిమ్బమాసీత్
కించాభవ న్మృగకిశోరదృశో నితమ్బః
సర్వాధికో గురురయం సహ మన్మథేన॥ 78

శ్వాసోనుమానవేద్యః
శీతా న్యఙ్గాని నిశ్చలోదృష్టిః
తస్యాః సుభగ కథేయం
తిష్ఠతు తావ త్కథాన్తరం కథయ ॥ 79

క. మృదుపదముల నడుచుచు నా
మదవతి కటిభారమున శ్రమంపడుఁ బథమం
దిదె. వికలతఁ దద్రూపము
ఎవలక నేఁ గాంచి ఖేదపడియెద నకటా॥ 75

క. హరి మధురకేగుచో వ్రజ
తరుణీమణు లసుభరార్తిఁ దాలిచి, రాకేం
దురుచిఁ బ్రళయాగ్ని యని, మం
దిర గగనము వనధి యని గణించి రెడందన్॥ 76

మ. సురతాగారము సొచ్చి పైఁగల సఖీస్తోమం బటంబుచ్చి, తా
సరుష న్నిద్దురగొన్న యబ్జదృశ కాస న్వీవనన్వీచు న
న్నరయం, జూచియుఁ జూడనట్లై కను మాయామీలితాక్షిన్ ‘సఖీ
తొరగెంగాదె శ్రమం’బనన్ హృదయమందుం జేర్చె నాహస్తమున్

గీ. నడక బాల్యముతోడ మందత వహించె
మన సధరబింబమును రక్తిమను ధరించె
బలు పిఱుఁ దనంగుతో మహత్త్వంబుఁ గాంచె
నిఖిలమున మృగశాబక నేత్ర కపుడు॥ 78

గీ. ‘అదిర! సుభగకు శ్వాసమున్నదియొ. లేదొ.
సందియం; బంగములుఁగూడఁ జల్లనయ్యె;
నిశ్చలముదృష్టి’–యని పల్కునెయ్యుఁ జూచి,
‘సరియె, పిడపనే’ మని ప్రశ్న సలిపెఁ బ్రియుఁడు॥ 79

పాణౌ కృతః పాణి రిలాసుతాయాః
సస్వేదకమ్పో రఘునన్దనేన
హిమామ్బు మన్దానిల విహ్వలస్య
ప్రభాత పద్మస్య బభార శోభామ్ ॥ 80

అరుణమపి విద్రుమద్రుం
మృదులతరం చాపి కిసలయం బాలే
అధరీకరోతి నితరాం
తవాధరో మధురిమాతిశయాత్ ॥ 81

పర పూరుష దృష్టి పాత వజ్రా
హతి భీతా హృదయం ప్రియస్య సీతా
అవిశ త్పరకామినీ భుజఙ్గీ
భయతః సత్వరమేవ సోఽపి తస్యాః ॥ 82

జమ్బీర శ్రియ మతిలఙ్ఘ్య లీలయైవ
వ్యానమ్రీకృత కమనీయ హేమ కుమ్భౌ
నీలామ్భోరుహ నయనేధునా కుచౌ తే
స్పర్ధే తే కిల కనకాచలేన సార్ధమ్ ॥ 83

అఙ్గాని దత్వా హేమాఙ్గి
ప్రాణాన్ క్రీణాసి చే న్నృణామ్
యుక్తమేత న్నతు పునః
కోణం నయన పద్మయోః ॥ 84

గీ. క్ష్మాసుతాపాణియందు రాఘవుఁడు పాణిఁ
జేర్ప సస్వేదకంపమై చెలఁగి మంచు
నీటి గంగానిలమున నెంతేఁ గలంగు
నాప్రభాతాబ్జశోభ నయ్యది వహించె॥ 80

క. పవడపుమ్రాఁకును నరుణిమఁ,
జివురుల మృదుతరమున౯ హసించును మాధు
ర్యవిశేషముచే నందం
బవు నీకెంబెదవి యిదె, నితాంతము బాలా! 81

గీ. పరపురుష దృష్టిపాతమన్ వజ్రహతికిఁ
దలఁకి వైదేహి ప్రియునిడెందంబుఁ జొచ్చె
నన్యరమణీ భుజంగికి నళికి యతఁడు
నల్లై సత్వరముగ నామె యాత్మఁ జొచ్చె॥ 82

గీ. లీల జంబీరశోభఁ దా నేలి, రమ్య
కనక కలశాల కానమ్రతను ఘటించి,
బంగరుం గొండతోఁ గూడ స్పర్ధఁ బూనె
నీకుచద్వయి యిప్పు డిందీవరాక్షి॥ 83

గీ. బంగరుంబొమ్మ! సొబగౌ త్వదంగములిడి
పురుషరత్నానువుల విల్వఁ బూను టురవు,
గాని నయనాబ్జ కోణాలచేఁ గొనంగఁ
గడఁగు టెంతయు యుక్తంబు గాదుకాదు॥ 84

జిత మౌక్తిక సమ్పదాం రదానాం
సహవాసేన పరాం ముదం దధానమ్
విరసా దధరీకరోతి నాసా
మధునా సాహసశాలి మౌక్తికం తే ॥ 85

నిభాల్య భూయో నిజ గౌరిమాణం
మానా మమానం సహసైవ యాయాః
గృహే గృహే పశ్య తవాఙ్గవర్ణా
ముగ్ధే సువర్ణావలయో లుఠన్తి ॥ 86

కరికుమ్భ తులా మురోజయోః
క్రియమాణాం కవిభి ర్విశృఙ్ఖలైః
కథమాలి శృణోషి సాదరం
విపరీతార్థ విదో హి యోషితః ॥ 87

తిరస్కృతో రోషవశాత్పరిష్వజ
న్ప్రియో మృగాక్ష్యా శయితః పరాఙ్ముఖః
కిం దుఃఖితో సా వితి కాందిశీకయా
కయాచి దాచుమ్బ్య చిరాయ సస్వజే ॥ 88

చేలాఞ్చలే నానన శీతరస్మిం
సంవృణ్వతీనాం హరిదృశ్వరీణామ్
వ్రజాఙ్గనానాం స్మరజాతకమ్పా
దకాణ్డసంపాత మియాయ నీవీ ॥ 89

గీ. హీరమణికాంతి గెలిచిన నీరదముల
పొత్తు గలుగుట నీవత్తుముత్తె మెపుడు
గడుఁజెలంగి యధఃకరించెడిని నౌర!
శ్వాసమిషమున, నిదిగో, నాసను శుభాంగి!॥ 85

గీ. మాటిమాటికి నిజగౌరిమంబుఁ గాంచి
గర్వమొందుట విడుము తత్క్షణము ముగుద
యేలన ;—త్వదంగవర్ణమే యింటనింట
దొరలుచుండు సువర్ణపంక్తులుగఁ గనుము॥ 86

గీ. చెలియ! కుచములు కరికుంభములని కవులు
పలుకఁగ విశృంఖలత, వింద వెలమి నీవు
నేను పలికినచోఁ గోప మూనుదేల?
వెలఁదుకల్ విపరీతార్థ విదలు గారె?॥ 87

చ. హరిణవిలోలనేత్రఁ బ్రియుఁడక్కునఁ జేర్పఁగఁ, గిన్కనామెయున్
గరముఁ దిరస్కరింపఁగఁ మొగం బటు ద్రిప్పి పరుండె నాతఁ, "డీ
నరణి నితం దదేలొకొ విచారము నొందెడు" నంచు భీతయై
చిరముగఁ గౌఁగిట న్నిలిపెఁ జెల్వుని సారెకు ముద్దువెట్టుచున్ 88

గీ. పయఁటకొంగున నాననపార్వణేందు
దాఁచి, తమకంబుతో హరిఁ జూచుబుద్ధిఁ
బోవు వ్రజతరుణుల పోఁకముడి, యకాంత
సంపతనమందె స్మర జాత కంపషఃగుచు॥ 89

అధరేణ సమాగమాద్రదానా
మరుణిమ్నా పిహితోపి శుక్లభావః
హసితేన సితేన పక్ష్మలాక్ష్యాః
పున రుల్లాస మవాప జాత పక్షః ॥ 90

శయితా సవిధేప్యనీశ్వరా
సఫలీకర్తు మహో మనోరథాన్
దయితా దయితాననామ్బుజం
దరమీలన్నయనా నిరీక్షతే॥ 91

నయనే వహతాం ను ఖఞ్జనానా
మిహ నానావిధ మఙ్గభఙ్గ భాగ్యమ్
ముఖమేతు తులాం కథం సుశోభం
సుదృశో భఙ్గుర సమ్భ్రదామ్బుజేన॥ 92

ఉదితం మణ్డల మిన్దో
రుదితం సద్యో వియోగి వర్గేణ
ముదితంచ సకల లలనా
చూడామణి శాసనేన మదనేన 93

ఇద మప్రతిమం పశ్య
సరః సరసిజై ర్వృతమ్
సఖే మా జల్ప నారీణాం
నయనాని దహన్తి మామ్॥ 94

గీ. పలువరుస మోవిసఖ్యంబుకలిమిఁదనదు
వెల్లఁదనమెల్ల, దానికావిని నణంగి
పోవ శుభ్రస్మితంబు గ్రమ్ముకొనె దానిఁ
గాననది పూర్వవికసన మూనెమరల॥ 90

క. ప్రియునికటమున, రతిశ్రమ
శయనించి, తదాననాంబుజము దరమీల
న్నయనములఁ గాంచె నెంతయు
దయిత మనోరథము సఫలతం గన వేగన్॥ 91

.క మృగనేత్రనయనములు పలు
వగలన్ ఖంజాంగ భంగ భాగ్యము నీతీ
రుగఁ దాల్చెనొ?, రాజిలు మో
మగు నేగతి విగతసంపదాంబుజ సమముల్॥ 92

గీ. పొడమెను శశాంకమండల,
మడలె వియోగ్రి ప్రకాండ, మానందంబుం
బడసె వధూరత్నంబులఁ
గడు శాసించెడు మరుండు కౌతూహలియై॥ 93

గీ. "నిరుపమమ్మై సరసిజములఁ
బరివృతమగు సరసి నిదిగొ, పరికింపు సఖా!"
'ఉరక వచింపకు నన్నుం
దరుణుల నయనములు దరికొనంగలవంచుల్॥ 94

గురుమధ్యే హరిణాక్షీ
మా ర్తికశకలై ర్నిహన్తు కామం మామ్॥
రదయన్త్రిత రసనాగ్రం
తరలిత నయనం నివారయాంచక్రే॥ 95

అధిరజని ప్రియ సవిధే
కథమపి సంవేశితా గురుభిః
కిం భవితేతి సశఙ్కం
పఙ్కజనయనా పరామృశతి॥ 96

న్యఞ్చతి వయసి ప్రథమే
సముదఞ్చతి తరుణిమని సుదృశః
దధతిస్మ మధురిమాణం
వాచో గతయశ్చ విభ్రమాశ్చ భృశమ్॥ 97

ఔత్సుక్యా త్పరిమిలతాం
త్రపయా సఙ్కోచ మఞ్చతాంచ ముహుః
నవ సంగమయో ర్యూనో
ర్నయనానా ముత్సవో జయతి॥ 98

సుదృశో జిత రత్న జాలయా
సురతాన్త శ్రమ బిన్దు మాలయా
అలికేన చ హేమ కాన్తినా
విదధే కాపి రుచిః పరస్పరమ్॥ 99

## భామినీవిలాసము

గీ. గురుజనులనడుమ నున్న యాహరిణనయన,
పంటిబెడ్డల ప్రేయఁగ మదిఁ దలంచు
నన్నుఁ గని నాల్కకొన రదనముల నొక్కి
చంచలాపాంగమున నివారించె నౌర!' 95

క. రజనిం గురుజనములచే
నిజవిభుకడ కెటులొ తెచ్చి నిలుపఁ బడిన యం
బుజనయన శంక మనమున
గజిబిజిపడె నేమి యగునొకో యట ననుచున్॥ 96

క. ప్రథమవయసున సంకోచభావ మొందు
యౌవనంబునఁ గాంతిచే నందగించుఁ
బ్రచురవాక్కుల నానందరసముఁ జిల్కఁ
గాంత, కవుల విలాసముల్ గడలుకొలుపు॥ 97

గీ. తొలితొలిం గూడు యువకుల చిలిపికనుల
పండువుల యందములఁ గూర్చి పలుకవలెనె?
బలితపుందమిఁ జూపులు గలియుఁ దలఁచుఁ
గాని వెంటనె సంకోచమూని మలఁగు॥ 98

గీ. చకితమృగనేత్ర నిజరత్నజాలమునను
మదనరణపరిశ్రమబిందుమాలవలన
రమ్యహేమాలికమునఁ బరస్పరంబు
నెగడెఁ దాల్చి యనిర్వచనీయకాంతి॥ 99

కిమితి కృశాసి కృశోదరి
కిం తవ పరకీయ వృత్తాన్తైః
కథయ తథాపి ముదే మమ
కథయిష్యతి పథిక తవ జాయా॥ 100

వదనారవిన్ద సౌరభ
లోభా దిన్దిన్దిరేషు నిపతత్సు
మయ్యధరార్థిని సుదృశో
దృశో జయ న్త్యతి రుషా పరుషాః॥ 101

సరసిరుహోదర సురభా
వధరిత బిమ్బాధరే మృగాక్షితవ
వదవదనే మణిరదనే
తామ్బూలం కేన లక్షయేమ వయమ్॥ 102

ఇతి శ్రీ పండితరాజ జగన్నాథ విరచితే
భామినీవిలాసే శృఙ్గారసముల్లాసః



# భా మి నీ వి లా స ము

గీ. 'ఇటు, కృశోదరి! చిక్కితివేమి ? చెప్పుమ ?'
'ఏల పరకీయలగువారి జోలి నీకు ?'
'ముదముఁ గూర్పఁగనేని నాకది వచింపు'
'నయిన నీజాయ పలుకు నీకరుగు పాంథ!!' 100

గీ. మోముఁదమ్మి పరిమళమును గ్రహించు
మోహమునఁ దేంట్లు వ్రాలెడు మోవిచివురుఁ
బ్రార్థనముసేయు నాపయి రమ్యనయన
రుషను బఱపెడు పరుషదృగ్గుచులు చెలఁగు॥ 101

గీ. తామరసగర్భసురభి నధఃకరించు
రమ్యబింబాధరము మణిరదనయుతము
నీదువదనమునఁ గురంగనేత్ర! మేము
విడియపుంగుర్తు గనుఁగొను విధము చెపుమ!॥ 102

భామినీవిలాసము శృంగారసముల్లాసము
స మా ప్త ము!



శ్రీః

# భా మి ని వి లా స ము
## క రు ణ స ము ల్లా స ము



దైవే పరాగ్వదనశాలిని హన్త జాతే
యాతే చ సంప్రతి దివం ప్రతి బంధురత్నే
కస్మై మనః కథయితాసి నిజామవస్థాం
కః శీతలైః శమయితా వచనై స్తవాధిమ్ ॥ 1

ప్రత్యుద్గతా సవినయం సహసా పురేవ
స్మేరైః స్మరస్య సచివైః సరసావలోకైః
మా మద్య మఞ్జురచనై ర్వచనైశ్చ బాలే
హా లేశతోపి న కథం శిశిరీకరోషి॥ 2

సర్వేపి విస్మృతపథం విషయాః ప్రయాతా
విద్యాపి ఖేదగలితా విముఖీబభూవ
సా కేవలం హరిణ శావక లోచనా మే
నైవాపయాతి హృదయా దధిదేవతేవ॥ 3

నిర్వాణ మఙ్గలపదం త్వరయా విశన్త్యా
ముక్తా దయావతి దయాపి కిల త్వయాసౌ
యన్మాం స భామిని నిభాలయసి ప్రభాత
నీలారవిన్ద మదభఙ్గిమదైః కటాక్షైః 4

శ్రీః

# భామినీవిలాసః

## కరుణవిలాసః

★

గీ. దైవము పరాఙ్ముఖమ్ముగాఁ దఱలితిగదె
నాకమునకిప్డు బంధురత్నంబ ! యకట !
తెలిపి తెవనికిఁ వ్వన్నిజస్థితిని జెపుమ !
శీతలోత్తుల నెవఁడు నీచింతలడఁచె ?॥ 1

గీ. మునుపువలె ననుఁగనినవెంటనె, యనంగ
సచివములగు స్మితంబులు, సరసవృతులు
మెంచ, వినయాన నెదురేఁగుదెంచి, యకట !
యించుకయు, నన్నుపచరింపవేల ?, బాల !॥ 2

గీ. విస్మృతి పథంబుఁగనె. సర్వ విషయములును,
విద్యయును ఖేదగళితమై విముఖమయ్యె.
నాహరిణశావశాక్షియ, యరయనాదు
భావమునువీడి, చన దధిదేవతవలె॥ 3

గీ. భామినీమణి ! నిర్వాణ భద్రపదముఁ
గాంచ నరుగుదయావతి ! కనఁగరాదె ?
ప్రాతరసితాబ్జ మదభంగ రమ్యము లగు
వాలుఁజూపుల, నను, దయవదలితొక్కొ ! 4

## భా మి నీ వి లా సః

ధృత్వా పదస్ఖలన భీతివశాత్కరం మే
యా రూఢవత్యసి శిలాశకలం వివాహే
సా మాం విహాయ కథమద్య విలాసిని ద్యా
మారోహసీతి హృదయం శతధా ప్రయాతి ॥ 5

నిర్దూషణా గుణవతీ రసభావపూర్ణా
సాలంకృతిః శ్రవణ కోమల వర్ణరాజిః
సా మామకీన కవితేవ మనోభిరామా
రామా కదాపి హృదయా న్మమ నాపయాతి॥ 6

చిన్తా శశామ సకలాపి సరోరుహాణా
మిన్దోశ్చ బిమ్బ మసమాం సుషమామయాసీత్
అభ్యుద్గతః కలకలః కిల కోకిలానాం
ప్రాణప్రియే యదవధి త్వమితో గతాసి॥ 7

సౌదామినీ విలసిత ప్రతిమానకాణ్డే
దత్వా కియ న్త్యపి దినాని మహేన్ద్రభోగాన్
మన్త్రోజ్ఝితస్య నృపతేరివ రాజ్యలక్ష్మీ
ర్భాగ్యచ్యుతస్య కరతో మమ నిర్గతాసి॥ 8

కేనాపి మే విలసితేన సముద్గతస్య
కోపస్య కింను కరభోరు వశంవదాభూః
యన్మాం విహాయ సహసైవ పతివ్రతాపి
యాతాసి ము క్తి రమణీ సదనం విదూరమ్॥ 9

చ. అడుగులఁ దొట్రుపాటొదవునంచు, భయంపడి, నాకరంబుసొం
పడర వివాహవేళఁ గొని యూసనెకంటిని నెక్కలేదె ? నేఁ
విడిచియెటు ఘూబిలాసనము నీవిపుడెక్కితి వొంటిగా, నటం
చెదఁద యనేకయోజనల కెంతయుఁ బొల్పడె నోవిలాసినీ! 5

గీ. దూషణాపేత, గుణవతి, పోషితరస
భావపూర్ణ, యలంకార బహుళ, శ్రవణ
రమ్యవర్ణావళి, మనోభిరామ, మత్కృ
విత్వమటు, రామ నామది వీడదెపుడు॥ 6

గీ. జీవితేశ్వరి! యిటనుండి నీవువెడలఁ,
దొలఁగె సకలసరోరుహములకుఁ జింత ;
తనరె శశిబింబ మసమశోభను వహించి ;
చెలఁగె నిదె, కోకిలలకును గలకలంబు॥ 7

చ. లలిత తటిల్లతా రుచివిలాసమురీతి మహేంద్ర భోగముల్
బలువిడిఁ గొన్నినాళ్లొసఁగి పక్షితమంత్రుని మానవాధిపుం
దొలఁగిన రాజ్యలక్ష్మినలె దూటితి వెంతయు, నాదుపాణిని
గ్గళితమునొంది, నీవిపు దకాండముగా దురదృష్టరేఖచేఁ॥

గీ. నీదుకోపంబు నేనేవినోదకృతిని
దీరిచి, వశంవదగఁ గరభోరు! నిన్ను
నలుపుదు విహారమగు ముక్తిసతివసతికి
సాధ్విపగునీవు న వీడి చనఁగఁదగునె 9

కావ్యాత్మనా మనసి పర్యణమన్పురా మే
పీయూషసార సరసా స్తవ యే విలాసాః
తాన న్తరేణ రమణీ రమణీయశీలే
చేతోహరా సుకవితా భవితా కథం నః ॥ 10

యా తావకీన మధురస్మిత కాన్తి కాన్తే
భూమండలే విఫలతాం కవిషు వ్యతానీత్
సా శాతరాక్షి విలయం త్వయి యాతవత్యాం
రాకాధునా వహతి వైభవ మిన్దిరాయాః ॥ 11

మన్దస్మితేన సుధయా పరిషిచ్య యా మాం
నేత్రోత్పలై ర్వికసితై రనిశం సమీజే
సా నిత్యమఙ్గలమయీ గృహదేవతా మే
కామేశ్వరీ హృదయతో దయితా న యాతి ॥ 12

భూమౌస్థితా రమణ నాథ మనోహరేతి
సమ్బోధనై ర్యమధిరోపితవత్యసి ద్యామ్
స్వర్గం గతా కథమివ క్షిపసి త్వమేణ
శావాక్షి తం ధరణి ధూలిషు మా మిదానీమ్ ॥ 13

లావణ్య ముజ్జ్వల మపాస్త తులం చ శీలం
లోకోత్తరం వినయ మర్థమయం నయం చ
ఏతాన్గుణా నశరణా నథ మాం చ హిత్వా
హా హన్త సున్దరి కథం త్రిదివం గతాసి 14

# భా మి నీ వి లా స ము

గీ. నీ సుధాసార సరసవిలాసములెవి
మునుపు కావ్యరూపమున నామనముఁజొచ్చె.
యవియు లేకెట్టు లవి మనోహరసుకవిత
యగును మాకు, సతీమనోజ్ఞాతిశీల ॥ 10

గీ. నీదుమధురస్మితము కాంతి నెగడ, రమ్య
మైనపున్నమనిసి నితయయ్యెఁగవుల
కవని, వీఁకనది నీవిలయమున నిపుడు
గాంచు లక్ష్మివిభూతి నోకాంతరాక్షి ॥ 11

గీ. నన్ను మందస్మితామృత స్నాతుఁజేసి
దృగ్వికసి తోత్పలముల నర్చించు నిరత
మెవతె, యానిత్యమంగళ యింటివేల్పు
దయిత, కామేశ్వరి మదాత్మఁదలఁగి చనదు॥ 12

గీ. మృగకిశోరాక్షి ! కూర్చుండియిలను 'రమణ'
'నాథ' చేతోహర,—యనియందముగఁ బిల్చి
యెవని దివిఁజేర్తు వట్టి నన్నిప్పుడిలను
ధూళిపాల్జేసి, దివికి నేలిలఁ జనితి ? 13

గీ. కాంతిఁగల యందమును, సాటిగననిశీల,
మమిత లోకోత్తర వినయ, మర్థయుక్త
నయము మున్నగుగుణముల, నన్నుఁ నశర
ణములవిడి, దివికెటులయ్యె ! రమణి ! చనితి॥ 14

# భా మి నీ వి లా సః

కాన్త్యా సువర్ణవరయా పరయా చ శుద్ధ్యా
నిత్యం స్వికాః ఖలు శిఖాః పరితః క్షిపన్తీమ్
చేతోహరా మపి కుశేశయలోచనే త్వాం
జానామి కోపకలుషో దహనో దదాహ ॥ 15

కర్పూరవర్తిరివ లోచన తాప హన్త్రీ
ఫుల్లామ్బుజస్రగివ కణ్ఠసుఖైకహేతుః
చేతశ్చమత్కృతిపదం కవితేవ రమ్యా
నమ్యా నరీభిరమరీవ హి సా విరాజే॥ 16

స్వప్నాన్తరేపి ఖలు భామిని పత్యురన్యం
యా దృష్టవత్యసి న కఞ్చన సాభిలాషమ్
సా సమ్ప్రతి ప్రచలితాసి గుణై ర్విహీనం
ప్రాప్తుం కథం కథయ హన్త పరం పుమాంసమ్ ॥ 17

దయితస్య గుణా ననుస్మరన్తీ
శయనే సమ్ప్రతి యా విలోకితాసీత్
అధునా ఖలు హన్త సా కృశాఙ్గీ
గిర మఙ్గీకురుతే న భాషితాపి ॥ 18

రీతిం గిరా మమృత వృష్టికరీం తదీయాం
తాం చాకృతిం కృతివరై రభినన్దనీయామ్
లోకోత్తరా మథ కృతిం కరుణారసార్ద్రాం
స్తోతుం న కస్య సముదేతి మనః ప్రసారః 19

ఇతి శ్రీ పణ్డితరాజ జగన్నాథ విరచితే
భామినీ విలాసే—కరుణసముల్లాసః

## భా మి నీ వి లా స ము

గీ. కాంతిగల సువర్ణవరమునఁ, గడుపవిత్ర
భావమునఁ దనమంటలఁ బడనడంచు
నిను, మనోహరఁ, గాల్చుమ గినుకఁబూని
జ్వలనుఁడని యెఱుంగుదు శతపత్రనేత్ర॥ 15

గీ. కప్పురంపు వత్తివలెఁ గనుకలఁకఁదీర్చు
నఖిశ వికచాబ్జసరిమటు హాయిఁగూర్చు
నెదకు సరసకవితవలె ముదమొనర్చు
నరసతీనమ్య యమరినాఁ బరగునామె॥ 16

గీ. భామినీ! స్వప్నమునసేనిఁ బతినిదక్కఁ
బరునినెవ్వని నభిలాష నరయవింత,
నట్టి నీవిప్డు గుణహీను నన్యపురుషుఁ
బడను నరిగితివెటు? లయ్యో! పలుకఁదగదె? 17

గీ. దయితుగుణములె పొరిఁబొరిఁ దలఁచుచాత్మఁ
గనులవిందుగ సెజ్జపైఁ గ్రాలునెవతె
యారమణి పలుకిపుడు బంగారమయ్యెఁ
జెంపననుఁగని పూటాడదింత, యకట! 18

గీ. సూరిజనమూనితంబు, సుధారసార్ద్రి
మమృత వృష్టికరంబగు నామెపలుకు
లాకృతియును లోకోత్తరమగు కృతియును
స్తవమొనర్పఁగఁ బ్రసరించు నెవని మనము॥ 19

భామినీ విలాసము కరుణ సముల్లాసము
సమాప్తము

శ్రీః

# భామినీవిలాసః

## శాంతసముల్లాసః



విశాల విషయాటవీ వలయ లగ్న దావానల
ప్రసృత్వర శిఖావలీ వికలితం మదీయం మనః
అమన్దమిలదిన్దిరే నిఖిల మాధురీమన్దిరే
ముకున్ద ముఖచన్ద్రిరే చిరమిదం చకోరాయతామ్॥ 1

అయే జలధినన్దినీ నయన నీరజాలమ్బన
జ్వలజ్జ్వలన జిత్వర జ్వరభర త్వరా భఙ్గురమ్
ప్రభాత జలజోన్నమద్గరిమ గర్వ సర్వంకషై
ర్జగత్త్రితయ రోచనైః శిశిరయాశు మాం లోచనైః ॥ 2

స్మృతాపి తరుణాతపం కరుణయా హరన్తీ నృణా
మభఙ్గుర తనుత్విషాం వలయితా శతైర్విద్యుతామ్
కలిన్దగిరి నన్దినీ తట సురద్రు మాలమ్బినీ
మదీయ మతిచుమ్బినీ భవతు కాపి కాదమ్బినీ॥ 3

కలిన్దగిరి నన్దినీ తట వనాన్తరం భాసయన్
సదా పథిగతాగత శ్రమభరం హరన్ప్రాణినామ్
లతావలి శతావృతో మధురయా రుచా సంభృతో
మమాశు హరతు శ్రమానతితమాం తమాలద్రుమః ॥ 4

శ్రీః

# భామినీవిలాసము

## శాంతసముల్లాసము



చ. బహువిషయావళీవలయ వర్తిదవాగ్ని శిఖాతతిం గడుం
దహతహలాడు నామది, ననంతరమార్తము, సర్వమాధురీ
గృహము, పురాసురాంతక ముఖేందువునందుఁ జకోరమట్లు ప్ర
త్యహ మొనరింతు శాంతిపదతత్పరతం జిరసౌఖ్య మందఁగన్॥ 1

చ. జలనిధినందినీ నయన చారుసరోజ సమాశ్రయంబటుల్
జ్వలనతలంబు గెల్చు జ్వరభార కృశాంగు ననుం బ్రఖాతమం
పని జలజోన్నమద్గరిమదర్పము సర్వమడంచి, ముజ్జగం
బులఁ బ్రసరించు చూపులఁ బ్రమోదమునన్ శిశిరుం బొనర్పవే॥ 2

మ. శతశంపాక్షయ దేహదుగ్వలయితాంచద్వ్యగ్రిమై, సత్కృపన్
స్మృతిమాత్ర, స్మరయౌవనాత్మపహారద్ధేమంబునై, తాఁ గళిం
దతనూజా తట కల్పభూరుహము చెంతం గ్రాలు కాదంబినీ
లత సప్రేమ మదీయసన్మతిని లీలంజేరి చుంబించుతన్॥ 3

గీ. యమునయొడ్డున బృందావనాంతరమున
శతలతావళివృతమయి, చారుకాంతి
భృతమయి, పథి నెపుడు, గతాగతులశ్రమము
లుడిపెడు తమాల మడఁచు నాబడలు నిపుడు॥ 4

## భామినీ విలాసః

వాచా నిర్మలయా సుధా మధురయా యాం నాథ శిక్షామద
స్తాం స్వప్నేపి న సంస్మరామ్యహ మహం భావానృతో నిస్త్రపః
ఇత్యాగః శతశాలినం పునరపి స్వీయేషు మాం బిభ్రత
స్త్వత్తో నాస్తి దయానిధి ర్యదుపతే మత్తో న మత్తోపరః ॥ 5

పాతాలం వ్రజ యాహి వా సురపురీ మారోహ మేరోః శిరః
పారావార పరమ్పరాం తర తథాప్యాశా న శాన్తా తవ
ఆధి వ్యాధి జరా పరాహత యది క్షేమం నిజం వాఞ్ఛసి
శ్రీ కృష్ణేతి రసాయనం రసయ రే శూన్యైః కిమన్యైః శ్రమైః ॥ 6

మృద్వీకా రసితా సితా సమశితా స్ఫీతం నిపీతం పయః
స్వర్యాతేన సుధాప్యధాయి కతిధా రమ్భాధరః ఖణ్డితః
సత్యం బ్రూహి మదీయ జీవ భవతా భూయో భవే భ్రామ్యతా
కృష్ణే త్యక్షరయో రయం మధురిమోద్గారః క్వచిల్లక్షితః ॥ 7

వజ్రం పాపమహీభృతాం భవగదోద్రేకస్య సిద్ధౌషధం
మిథ్యాజ్ఞాన నిశా విశాల తమస స్తిగ్మాంశు బిమ్బోదయః
క్రూరక్లేశ మహీరుహా మురుతర జ్వాలా జటాలశ్శిఖీ
ద్వారం నిర్వృతి సద్మనో విజయతే కృష్ణేతి వర్ణద్వయమ్ ॥ 8

రే చేతః కథయామి తే హితమిదం బృన్దావనే చారయన్
వృన్దం కోపి గవాం నవామ్బుదనిభో బన్ధుర్న కార్య స్త్వయా
సౌన్దర్యామృత ముద్గిరద్భి రభితః సంమోహ్య మన్దస్మితై
రేషత్వాం తవ వల్లభాంశ్చ విషయా నాశు క్షయం నేష్యతి ॥ 9

# భా మి నీ వి లా స ము

మ. విమలంబై, యమృతంబుటుల్ మధురమౌ ప్రేమోక్తి నీవిచ్చు శి
క్ష, మదిన్ నేఁ గలయందుఁగూడఁ దలఁపన్ సాహంకృతిన్ నిష్ప్రపో
ద్యముఁ, బాపు, న్ననుఁ జేర్పు నీజనుల, నిన్ దక్కన్ గృపాశాలి లేఁ
డమితోస్మత్తుఁడు నన్నుఁదక్క యదునాథా! నాథ! లేఁడెమ్మెయిన్

మ. మనమా! యాధిరుజాజరాహతమ! జృంభత్తృష్ణ నీకాల దె
బ్బను, బాతాళమునొచ్చినన్, సురలప్రోలుంచేరినన్ మేరుశై
లనితాంతాగ్రము నెక్కినన్, వనధులన్ లంఘించినన్, మేలుగో
రినచోఁ గృష్ణరసాయనంబుఁ గొను మర్థిన్, బొందనేలా శ్రమల్?

గీ. ద్రాక్షచవిఁగంటి, తింటి శర్కరయుఁ జాలఁ
బాలు ద్రావితి. దివి సుధఁ గ్రోలి, తింతి
జిగిపెదవి గంట్లిడితి, జీవ! చెప్పెద విను
'కృష్ణ' మధురాక్షరము విడుఁ దృప్తిఁ గొనుము॥ 7

గీ. పాపగిరులకుఁబవి, భవవ్యాధిమందు,
కల్పితాజ్ఞానశర్వర్యనల్పతమస
మున కినూదయ, మతికష్టభూజవహ్ని
ద్వారమగు నిర్వృతికిఁ 'గృష్ణ' వర్ణయుగము॥ 8

మ. ఇదిగో, చిత్తమ! నాదుపల్కు వినుమా: బృందావనిన్ గోతతిన్
మెదలన్ జారునవాంబుదాభుఁ డొకఁ డెంతే; బంధులింకేల? హా
రిదరస్మేరసుధాస్రవంతి నతఁడర్థిన్ మోహితుంజేసి, నీ
దుఃదురంతంబౌ విషయప్రియాళి నిపుడే ద్రుంగింపఁగాఁ జాలెడున్

అవ్యాఖ్యేయాం వితరతి పరాం ప్రీతి మన్తర్నిమగ్నా
కణ్ఠే లగ్నా హరతి నితరాం యాన్తరధ్వాన్తజాలమ్
తాం ద్రాక్షాద్యో రపి బహుమతాం మాధురీ ముద్గిరన్తీమ్
కృష్ణేత్యాఖ్యాం కథయ రసనే యద్యసి త్వం రసజ్ఞా ॥ 10

సన్త్యేవాస్మి జ్జగతి బహవః పక్షిణో రమ్యరూపా
స్తేషాం మధ్యే మమతు మహతీ వాసనా చాతకేషు
యై రధ్యక్షై రథ నిజసఖం నీరదం స్మారయద్భిః
చిత్తారూఢం భవతి కిమపి బ్రహ్మ కృష్ణాభిధానమ్ ॥ 11

విష్వద్రీచ్యా భువనమఖిలం భాసతే యస్య భాసా
సర్వాసా మప్యహమితి విదాం ప్రత్యయాలంబనం యః
తంపృచ్ఛన్తి స్వహృదయమనావేదినో విష్ణు మన్యా
నన్యో యోయం శివశివ నృణాం కేన వా వర్ణనీయః ॥ 12

సేవాయాం యది సాభిలాషమసి రే లక్ష్మీపతిః సేవ్యతామ్
చిన్తాయామసి సస్పృహం యది తదా చక్రాయుధ శ్చిన్త్యతాం
ఆలాపం యది కాంక్షసి స్మరరిపో ర్గాథా తదాలప్యతాం
స్వాపం వాఞ్ఛసి చే న్నిరర్గల సుఖే చేతః సఖే సుప్యతామ్॥ 13

భవగ్రీష్మ ప్రౌఢాతప నివహ సంతప్త వపుషో
బలాదున్మూల్య ద్రాఙ్నిగడ మవివేక వ్యతికరమ్
విశుద్ధేస్మి న్నాత్మామృత సరసి నైరాశ్య శిశిరే
విగాహన్తే దూరీకృత కలుషజాలాః సుకృతినః ॥ 14

గీ. రసన ! రసజ్ఞపైనయెడ ద్రాక్షసమూహముకన్న మించు తీ
పెసఁగెడు 'కృష్ణ'యన్ పలుకునెప్పుడుపల్కుమ; మదేలనన్ హృదిం
బొసఁగి వచింపరాని ప్రియముం గడుఁ గూర్చు, గళంబునందు, దా
రిసిరి దొలంచుఁ జిత్తమునఁ గ్రాలు తమోనిచయంబుఁ బూర్తిగన్॥

గీ. జగతిఁ గలవెన్నొ రమణీయ ఖగము, లందుఁ
గరము మాకాదృతులు, చాతకములె; యేల
యన: నిజసఖంబు కృష్ణాఖ్యఘనము, నూర్ధ్వ
దృష్టులం గాంచి, స్మరియించు నెదను నిల్పి॥ 11

చ. ఎవని సమస్తవస్తురుచు లీనెడు భాసముచే విరాజిలున్
భువనము, లెవ్వఁ డెల్లరకుఁ బూర్తిగ 'నే'నను ప్రత్యగాశ్రయం
బవు, నలవిష్ణుఁగూర్చి హృదయావిదు లన్యులఁ బ్రశ్నసేయుచో
శివశివ ! మానవావినయచేష్ట లవేరికి వర్ణనీయముల్ ?॥ 12

చ. కొలువఁగ నాసయేని మదిఁగోల్వుము యెల్లపు దారమావరున్
దలఁపఁగఁ గాంక్షయేని సతతంబుఁ దలంపుమ చక్రహస్తునికొ
బలుకఁగ వాంఛయున్న స్మరభంజనుగాథలఁ బల్కుఁ కూర్కఁగన్
వలచితివేని స్వస్థత నసర్గళసౌఖ్యమునందుఁ గూర్కుమా॥ 13

మ. భవమన్ వేసవియెండకున్, మిపులఁ దప్తంబైన మేన్గల్గు నా
ర్యవరాంచద్ద్వీపముల్, బలాన, నవివేకాధిక్యమన్ శృంఖలం
బు వెసంద్రెంచి, నిరాశ, శీత మమలంబుం గాఁగఁ జెల్వారు నా
త్మవిలాసామృతయుక్సరస్సున, నశింపం బాపముల్, దోఁగెడున్॥

## భా మి నీ వి లా సః

బన్ధోన్ముక్త్యై ఖలు మఖముఖాన్ కుర్వతే కర్మపాశాన్
నన్తఃశాన్త్యైః మునిశత మతానల్పచిన్తాం భజన్తి
తీర్థే మజ్జన్త్యశుభజలధేః పారమారోఢుకామాః
సర్వం ప్రామాదిక మిహ భవ భ్రాన్తి భాజాం నరాణామ్॥ 15

ప్రథమం చుమ్బిత చరణా
జఙ్ఘా జానూరు నాభి హృదయాని
ఆలింగ్య భావనా మే
ఖేలతు విష్ణో ర్ముఖాబ్జ శోభాయామ్॥ 16

చరణోపాయ మపశ్యన్
అయి మామక జీవ తామ్యసి కుత స్త్వమ్
చేతః సరణావస్థాం
కిం నాగన్తా కదాపి నన్దసుతః 17

శ్రియో మే మా సన్తు క్షణమపి చ మాద్యద్గజఘటా
మదభ్రామ్య ద్భృంగావలి మధుర ఝుంకార సుభగాః
నిమగ్నానాం యాసు ద్రవిణరస పర్యాకులహృదాం
సపర్యా సౌకర్యం హరిచరణయో రస్తమయతే॥ 18

కిం నిఃశంకం శేషే శేషే
వయసః సమాగతో మృత్యుః
అథవా సుఖం శయీథా
నికటే జాగర్తి జాహ్నవీ జననీ॥ 19

# భా మి నీ వి లా స ము

చ. క్రతుముఖకర్మపాశములఁ గైకొనుటల్ కడు బంధముక్తికిన్,
శ్రుతిమునిసమ్మతాంచితవిచారము నూనుట చిత్తశాంతికిన్,
పెఱలసముద్రముం గడచువేడుకఁ దీర్థములాడుటల్, భవా
వృతి భ్రమఁగొన్న యీనరులకెల్లఁ బ్రమాదము లీసమస్తమున్॥

గీ. సరగఁ బదములఁ జుంబించి, జంఘ లంత,
జానువుల, నూరువుల, నాభిచక్ర మావల
భక్తిఁ గౌఁగిలిఁ గొని, విష్ణు వదనకమల
కాంతి నాభావము రమించుఁగాత! సతము॥ 16

క. తరణోపాయము దొరుకక
పరితాపముఁ బొందెదేల? భావపథిన్ శ్రీ
హరి, నందనందనుండెపు
డరుగఁడె? యోజీవ! యాశ్రయము వాఁడె సుమీ॥ 17

గీ. మదగజఘటామదంబున మసలు తేంట్ల
పగిదిఁ, దియ్యని రొద సొంపు వఱలు సిరుల
నడరు ధనసుఖాకులులై కాహరిపదముల
సేవ పొసఁగదు, మాకొద్దు సిరులు వలదు॥ 18

క. అపగత సందేహమవయి,
యపరవయస్సునను నిద్ర నందెద వేలా?
కృప, జనని గంగ మేల్కొని
యెపు డండనె మెలఁగునని శయించితె? యాత్మా॥ 19

సంతాపయామి కిమహం
ధావం ధావం ధరాతలే హృదయమ్
అస్తి మమ శిరసి సతతం
నన్దకుమారః ప్రభుః పరమః ॥ 20

రే రే మనో మమ మనోభవ శాసనస్య
పాదామ్బుజ ద్వయ మనారత మానమంతమ్
కిం మాం నిపాతయసి సంసృతి గర్త మధ్యే
నైతావతా తవ గమిష్యతి పుత్రశోకః॥ 21

మరకత మణి మేదినీధరో వా
తరుణతర స్తరు రేషవా తమాలః
రఘుపతి మవలోక్య తత్ర దూరాత్
ఋషినికరై రితి సంశయః ప్రపేదే॥ 22

తరణితనయా కిం స్యా దేషా న తోయమయీ హి సా
మరకతమణి జ్యోత్స్నా వా స్యాన్నసా మధురా రుతః
ఇతి రఘుపతేః కాయచ్ఛాయా విలోకన కౌతుకై
ర్వన వసతిభిః క్లైః కై ందో న సందిదిహే జనైః ॥ 23

చపలా జలదా చ్చ్యుతాలతా వా
తరుముఖ్యా దితి సంశయే నిమగ్నః
గురు నిఃశ్వసితైః కపి ర్మనీషీ
నిరణైషీ దథ తాం వియోగి నీతిః 24

క. నిరతము నందసుతుండుం
బరముఁడు ప్రభుఁ డెప్పుడు నాదు మ స్తకమునఁ, దాఁ
బరఁగఁగఁ, బరువిడి పరువిడి
ధరణిని నేసంగ్రహింపఁ దగినది కలదే ?॥ 20

గీ. మనమ ! నేను, మనోభవమథను చరణ
వనజయుగ మెప్డుఁ జింతింతు ననుచు, నన్ను
భవదుహరమునఁ బడఁద్రోయఁ బాడియగునె?
దీన నీపుత్త్రశోకంబు మానునొక్కొ॥ 21

గీ దూరమునఁ దోఁచు రఘుపతిఁ బాఱఁజూచి,
మరకతమణిగిరీంద్రమో, తరుణతరత
మాలతరురాజమో, యని మానసమున
సంయమివరేణ్యతతులు సంశయముఁ గనిరి॥ 22

గీ రవితనయయొక్కొ?—కాదు, నీరమయిగామి;
మరకతజ్యోత్స్నయో?—కాదు, మధురగామి:
యేమిది? యటంచు, శ్రీ రఘురాము మేని
చాయఁ జూచి వనస్థులు శంకఁ గనిరి॥ 23

గీ. అంబుదచ్యుతచపలయో, యమరభూజ
పతితవల్లియొ, యని శంకపడు మనీషి
వనచరుఁడు, దీర్ఘనిశ్శ్వాసమునవె, యామె
యగు వియోగిని యని నిర్ణయంబొనర్చె॥ 24

ఖ్యాతి ర్నీచగృహేషు విప్రసదనే దారిద్ర్య కోలాహలో
నాశో హన్త సతా మసత్పథజుషా మాయుః శతానాంశతమ్
దుర్నీతిం తవ వీక్ష్య కోప దహన జ్వాలా జటాలోపి స
న్కిం కుర్వే జగదీశ యత్పునరహం దీనో భవానీశ్వరః ॥ 25

ఆమూలా ద్రత్నసానో ర్మలయవలయితాదా చ కూలాత్పయోధే
ర్యావన్తః సన్తి కావ్య ప్రణయ పటవస్తే విశంకం వదన్తు
మృద్వీకా మధ్య నిర్య న్మసృణరసఝురీ మాధురీ భాగ్యభాజాం
వాచా మాచార్యతాయాః పదమనుభవితుం కోస్తి ధన్యో మదన్యః 26

గిరాం దేవీ వీణా గుణ రణన హీనాదరకరా
యదీయానాం వాచా మమృత మయ మాచామతి రసమ్
వచ స్తస్యాకర్ణ్య శ్రవణ సుభగం పణ్డిత పతే
రధున్వ న్మూర్ధానం నృపశు రథవాయం పశుపతిః ॥ 27

మద్వాణి మా కురు విషాద మనాదరేణ
మాత్సర్య మగ్న మనసాం సహసా ఖలానామ్
కావ్యారవిన్ద మకరన్ద మధువ్రతానా
మాస్యేషు ధాస్యసి తమాం కియతో విలాసాన్ ॥ 28

మధు ద్రాక్షా సాక్షాదమృత మథ వామాధరసుధా
కదాచి త్కేషాంచి న్నఖలు విదధీర న్నపి ముదమ్
ధ్రువం తే జీవన్తో ప్యహహ మృతకా మన్ద మతయో
న యేషా మానన్దం జనయతి జగన్నాథ భణితిః ॥ 29

మ. పలునీచాపళియిండ్ల భూతియు, ద్విజావాసంబులన్ లేమి, పూ
జ్యులకు న్నాశము, దుర్జనాళికి శతాయు, స్సిట్టి నీదుర్ణయం
బులకుం గోపహుతాశకీల లెటియుంబో, యైన, లోకేశ ! నే
జలుపంజాలుదునేమి ? దీనగతి నాసన్ విన్ ప్రభుం గొల్చెదన్॥

ఉ. మేరువునుండి యామలయమే సరిహద్దుగ నబ్ధితీర మీ
ధారుణిఁ గల్గు సత్కవుల ధన్యుఁడు లేఁడు, మదన్యుఁడేఁడు ? ద్రా
క్షారసమాధురీమసృణ సారఘురీమయవాక్కులన్ గ్సురా
దారపదంబు నేన గొన నర్హుఁడ నంచు వచింతు గట్టిగన్॥ 26

ఉ. ఏని సుధామయోక్తుల యహీనరసంబును గ్రోలువాణి, చేఁ
బూనిన వీణె తంత్రులను ముట్ట. కనాదరము న్వహించు, నా
ధీనిధి పండితేంద్రు సుడితీరు గ్రహించి శిరంబు నూఁపఁ డెం
తే నృపళుండు, దాఁ బశుపతిప్రతిముం డటు సేయనేర్చినన్॥ 27

గీ. మత్సరస్వతి ! మత్సరమగ్నహృదయు
లైన ఖలు లాదరించ రంచఁగల వలదు,
మహిత కావ్యాంబుజ మరంద మధుకరాస్య
ములఁ బ్రవర్శింపవే నీవు విలసనములు ! 28

గీ. మధువు, ద్రాక్షయుఁ బ్రత్యక్షసుధయు, రమణి
మోవి కొంచటు కొకొకప్పు మోద మొసఁగ
దీజగన్నాథకృతి యేరి కెలమి విడదో,
వారు జీవన్మృతులు, జడులౌర ! నిజము ! 29

నిర్మాణో యది మార్మికోసి నితరా మత్యన్త పాకద్రవ
న్మృద్వీకా మధుమాధురీ మదపరీహారో ద్ధురాణాం గిరాం
కావ్యం తర్హి సఖే సుఖేన కథయ త్వం సంముఖే మాదృశాం
నోచే ద్దుష్కృత మాత్మనా కృతమివ స్వాన్తాద్బహి ర్మాకృథాః ॥ 30

ధుర్యైరపి మాధుర్యై ర్ద్రాక్షా
క్షీరేక్షు మాక్షిక సుధానాం
వన్ద్యైవ మాధురీయం
పండితరాజస్య కవితాయాః ॥ 31

శాస్త్రాణ్యాకలితాని నిత్యవిధయః సర్వేపి సంభావితా
దిల్లీవల్లభ పాణిపల్లవతలే నీతం నవీనం వయః
సంప్రత్యుజ్ఝిత వాసనం మధుపురీ మధ్యే హరిః సేవ్యతే
సర్వం పండితరాజ రాజితిలకేనాకారి లోకాధికం ॥ 32

దుర్వృత్తా జారజన్మానో
హరిష్యన్తీతి శంకయా
మదీయ పద్యరత్నానాం
మంజూషైషా కృతా మయా ॥ 33

ఇతి పండితరాజ శ్రీ జగన్నాథ విరచితే భామినీవిలాసే
శాన్త సముల్లాసః

మ. హితుఁడా ! సత్కృతి సల్పు మర్మములు నీవెంతే గ్రహింతేనిఁ బ
క్వత నత్యంతరసంబు చిప్పిలెడు ద్రాక్షామాధ్వీమాధుర్యగ
ర్వత మోహారిధురీణకావ్య మిలమిన్ వాక్యామ్ము మాచెంత, నా
గతిఁ గాదేని, స్వపాపమట్లు, వెలిఁ బల్కం బోకుమా దానినిన్॥

చ. ద్రాక్షాక్షీరేక్షు వభినవ
మాక్షికపీయూషమధురిమం జెలఁగెడు స
ల్లక్షణ పండితరాట్కవి
తాక్షయ మగు తీపి వంద్యమగుఁ గాదె ధరన్॥ 31

గీ. పెర్లాశాస్త్రములం గ్రహించితి, విధుల్ వే నిత్యముల్ దీర్చితిన్,
ఢిల్లీవల్లభ పాణిపల్లవతలి న్నీతంబు తారుణ్యమున్,
జెల్లం గోరిక లిప్డు, శ్రీశు మధురన్ సేవింతు లోకాధికం
బెల్లం బండితరాజరాజివరు సత్కృత్యమ్ము లుత్కృష్టముల్॥ 32

క. వడి నామపద్యరత్నము
లిడితిం బదిలముగఁ గూర్చి యీమంజూషన్
జెడువృత్తి నడరు చెడిపల
కొడుకులు దొంగిలుదు రంచుఁ గూరిన శంకన్॥ 33

భామినీ విలాసము శాంత సముల్లాసము
సమాప్తము

శ్రీ దయితోరుసత్కృప రచించితిఁ దెల్గునఁ బండితేంద్ర కా
వ్యోదితపద్యముల్ బుధజనోత్కరహృద్రమణీయవాక్కులన్
బ్రోదిగఁ జిత్రభానువునఁ బుష్యమునం బహుళంబునందు నే
కాదశి భానువారమున క్ష్మాతలి నియ్యది శాశ్వతంబగున్॥



శ్రీ

# ప్రక్షిప్తములు

## అన్యోక్తిముక్తావళి

గీ. కస్తురీ! కడుగర్వము గాంచవలదు
సకల పరిమళ మూర్ధన్య సౌరభమున
గొండ యడవి గవిన్నక్కి కుములుచున్న
దీను స్వజనకు ససువులు దీయగలవు

శ్లో. అయిబత గురుగర్వం మాస్మకస్తూరియాసీః
అఖిల పరిమలానాం మౌళినాసౌరభేణ
గిరిగహన గుహాయాంలీనమత్యస్తదీనం
స్వజనక మమునైవ ప్రాణహీనంకరోషి॥ 1

గీ. ఓ మరాళమ! పులుగులసామి! పాలు
నీరు వేఱొనరించు నీ నేరుపెటకు
జనె? సరోవారి గనబడు చంద్రకళను
దమ్మిలేదూడనుచు గొనదలతు, సకట!

శ్లో. హేహంస! పక్షిప! పయస్సలిలం వివేక్తుం
శక్తస్య సంప్రతిమతిః క్వను తే ప్రయాతా?
కాసారవారిణి కళాం పతితాం యదిన్దో
రాదాతుమిచ్ఛసి బిసాఙ్కుర వాంఛయా త్వమ్ ॥ 2

## అన్యోక్తి సముల్లాసము

గీ. కొండెగాండ్రకు నోళ్లనఱుందు నాల్క-
నెపమున భుజంగి నిలిచె, గానియెడ జనులు
దానిచే నాకఁబడి జీవితముఁద్యజింతు
రెట్లు మంత్రము లోకయించుకేని లేక॥

శ్లో॥ వదనేవినివేశితా భుజఙ్గీ। పిశునానాం రసనామిషేణ ధాత్రా
అనయా కథ మన్యథావలీఢా। నహిజీవన్తి జనా మనాగమన్త్రాః 3

క. లాతులగుణములచేఁ గా
ఖ్యాతతముగ స్వగుణములన యలరుదు రార్యుల్
ఘూతలిఁ గస్తురివాసన। చేతం గాకెటు శపథముచేఁ జెలువారున్?

శ్లో॥ సన్తః స్వతః ప్రకాశన్తే గుణానపరతో నృణామ్
ఆమోదేనహికస్తుర్యాః। శపథేన విభావ్యతే॥ 4

క. సరసులకుఁ జుట్టుఁదిరిగెడుఁ,
బరువిడు, సమ్ముఖముఁజేరఁ బరిపరివచ్చున్,
మరలున్మధుపములు మనో
హరముగ జుమ్మనెడు రొదలు నంతట నిండన్

శ్లో॥ గుంజంతి మంజుపరితో। గత్వా ధావన్తి సమ్ముఖం
ఆవర్తన్తే నివర్తంతే। సరసీషు మధువ్రతాః 5

గీ. అన్యదుఃఖ విహారదక్ష! సువర్ణ
కార! దినములఁబడి నగ్గిఁ గాతు నన్నుఁ
గాచుకొలఁది గుణాతిరేకంబె నాకు,
నీకొ, పొగయును బూదియు నిండు నోట॥

# ప్రక్షిప్తములు

శ్లో. హేహేమకార, పరదుఃఖ విహారదక్ష,
కింమాం ప్రతారయసి వారశతాని వహ్నౌ
ఆతాపితేన మమయాతి గుణాతిరేకో
ధూమస్తవైవ వదనే కిల భస్మపాత॥ 6

క. శరనిధి, తా, నడుగున మణి
ధరియించును. శిరమునందుఁ దాల్చును దృణముగా
అరయ నిది కడలి దోసమె?
యిరవుగ మణి మణియె యగును; దృణముఁ దృణంబే

శ్లో. అబ్ధోరత్న మధోధత్తే ధత్తేచ శిరసాతృణమ్
అబ్ధేరేవ హి దోషోయం రత్నం రత్నం తృణం తృణం 7

గీ. గొప్పవారల కోర్కులు గొప్పవారె
తీర్పగల, రల్పులెట్టుల దీర్పఁగలరు?
గిరుల వేసవిదాహంబు శరదపంక్తి
తలఁగఁగల, వేఱ లెట్టులు దలఁగఁగలవు?

శ్లో. తుఙ్గాత్మనాం తుఙ్గతరాస్సమర్థాః మనోరథాన్పూరయితుం న నీచాః
ధారాధరాఏవ ధరాధరాణాం నిదాఘదాహః ప్రశమా నవద్యః॥ 8

గీ. ఓరిమార్జార! గూటిలో నున్ననన్ను
మురిపముగఁ బల్కు చిల్కను దఱిసి యఱతు,
వాడికోఱల నీమేను వ్రక్కలించు
కుక్కఁ జూచి స్వవీర్యంబు దక్కియుందు

# అన్యోక్తి సముల్లాసము

శ్లో. రే, రే, బిడాల, పరిగర్జసి మాంవిలోక్య
కీరంమనోహరరవం నిజపఞ్జరస్థమ్
శ్వానంవిలోక్య నహి దర్శయసి స్వవీర్యం
త్వద్దేహ పాటన పటుం దశనైః కరాలైః 9

గీ. ఎంగిలాకులకడ స్వజాతిం గనంగ
జగడమాడుమ, యోకుక్క! జగడగొండి!
రాచనగరున నాయిభరాజుఁ బూజ్యుఁ
గాంచి యేడ్చిన లాభంబు గలుగదింత॥

శ్లో. ఉచ్ఛిష్ట పత్త్రి నిచయే నిజజాతివర్గైః
యుద్ధం కురుష్వ కలహప్రియ సారమేయ
పూజ్యం విలోక్య నరదేవగృహే కరీంద్రం
మా రోదనంకురు ఫలంనహి తేస్తి కించిత్॥ 10

క. గొనములచే నున్నతగతిఁ గననగు, సింహాసనాదికములం గనునే?
ఘనరాజప్రాసాదము కొనకెక్కిన గరుడుఁ డగునొకో వాయసముల్

శ్లో. గుణై రుత్తుఙ్గానాం యాతి। నతు సింహాసనాదినా
ప్రాసాద శిఖరస్థోపి। కాకః కిం గరుడాయతే?॥ 11

క. నలినీకులవల్లభుఁ డీ
యలి, కమలినిఁ గృతరతిన్ మదాలసుఁడు, విధిన్
మెలఁగుచుఁ బరదేశమునం
దల కుటజ లతాంత రసము లానెడు, సకటా!

# ప్రక్షిప్తములు

శ్లో. అలి రసౌ నలినీకులవల్లభః
కమలినీ కృతకేలి మదాలసః
విధివశా న్మరదేశ ముపాగతః
కుటజ పుష్పరసం బహుమన్యతే॥ 12

క. చాతకము దప్పిగొని, జీ
మూతుని జలకణము లడుగు, మూఁడో, నాల్గో;
యాతఁడో, జగమంతయుఁ గడు
దాతృత్వము మెఱయ నీరు దా నించుఁ గటా!

శ్లో. చాతక స్త్రి చతురా న్పయఃకణా
న్యాచతే జలధరం పిపాసయా
సోపి పూరయతి విశ్వ మమ్బసా
హ న్త హ న్త మహతా ముదారతా॥ 13

క. ధరఁ బునుఁగుఁబిల్లి బీజము సురపూజలఁ బనికివచ్చు; స్థూలంబగు నా
ఖరవృషణ మెందునే నెవ్వరికేనిఁ బ్రయోజనంబె పరికింపంగన్॥
శ్లో. వనమార్జాల బీజస్తు। దేవభోగాయ కల్ప్యతే
ఖరస్య వృషణః స్థూలః కస్య వా కింప్రయోజనమ్॥ 14

క సుగుణములు జతనమొనరుప
నగును, బ్రయోజనము గలదె యాటోపములన్,
జగతిఁ బయస్సుల నీయని
వగు గోవుల సెట్టు అమ్మనగు గంటలచేన్॥

శ్లో. గుణేషు యత్నః క్రియతాం। కి మాటోపైః ప్రయోజనమ్
విక్రియన్తే నఘంటాభిః గావ క్షీర వివర్జితాః । 15

క. గౌరవ మారయ సద్గుణ వారముచేఁ గలుగు, జాతివలనఁ గలుగునే?
క్షీరార్ణవమునఁ బుట్టిన దారుణ హాలాహలంబు దా నుత్తమమే?॥

శ్లో. గుణై రుత్తుఙ్గతాం యాతి నతు జాతి ప్రభేదతః
క్షీరోదధి సముత్పన్నః కాలకూటః కిముత్తమమ్॥ 16

గీ. పరిణత రసాల భోగంబుఁ దొరఁగి యిటుల
పరుసముగఁ గూయు కాకులయిరవు, దీన,
ఫలిత పిచుమందమున స్వాదువాణి వితగ
నుందువేలొకో? రాచిల్క! । మందబుద్ధి!

శ్లో. ఫలవతి పిచుమన్దే మన్దబుద్ధే కిమర్థం
వసతి మధురవాణిం వ్యర్థయన్ రాజకీర
అతిపరుషరవాణాం వాయసానాం నివాసే
పరిణత సహకార ప్రాన్త భోగం విహాయ॥ 17

గీ. పద్మవనమున తేయెల్ల బంధనంబు
దంతిదానాన మద కర్ణ తాడనంబు
చంపకంబున స్వప్రాణ సంహరణము
ఎల్లెడల దుఃఖమే తేఁటి కిటుగాన॥

శ్లో. ప్రబన్ధనం పద్మవనే నిశాయాం। మతఙ్గదానే మదకర్ణతాళః

# ప్ర క్షి ప్త ము లు

స్వప్రాణభజ్గః ఖలు చమ్పకేస్మిన్। సర్వత్ర దుఃఖం భ్రమరస్యలోకే॥

గీ. చెట్టుచెట్టున, నింటింట, గట్టుగట్టు
నందుఁ జలచంచుపుటములై యలమఁ గాకు-
లంద వింతయుఁ దృప్తి; రాయంచ పుండ
రీక షండమున న్నిల్చి తృప్తిఁ గాంచు॥

శ్లో. ప్రత్యఙ్గణం ప్రతితరుం ప్రతివారితీరాం
కాకా శ్చరన్తు చల చఞ్చుపుటా రట న్తః
నో యాతి తృప్తి మథ మణ్డితపుణ్డరీక
షణ్డే వసన్నహ తుష్యతి రాజహంసః 19

క. కాకముగూడ వసించున
యాఁకలు మొలతెంచుదాఁకనే, పికశిశువా!,
నీకంత నుండ సరసపు
మాకందము లెన్నో కలవు మహి నెల్లెడలన్॥

శ్లో. అయి, కోకిల పాక కాక నీడే వస యావద్భవతో భవన్తిపక్షాః
బహవ స్తదనన్తరం నివాసాః సరిత స్సన్తి రసాధికో రసాలః 20

క. జననస్థలి కరిరాట్ఛిర మనయంబు నివాసమెన్న నవనిపమకుటం
బనభిజ్ఞు లాదరంబునఁ గనకున్నన్ దప మౌక్తికమునకుఁ
గలదే

శ్లో. జన్మస్థలీ వారణరాజ మూర్ధా మహీపతీనాం మకుటే నివాసః
అనాదరంచే త్కురుతే నభిజ్ఞో ముక్తాఫలానా మిహ కోపరాధీ॥

## అన్యోక్తిసముల్లాసము

క. గురువిందలఁ జెలువొందెడు
కురులముడిఁ గ్లలుగు శబరికోటుల పురి, సుం
దర మౌక్తికములకు వణి
గ్వరు లరుదనఁ, దద్గుణజ్ఞవరు లెవ్వ రటఁ॥

శ్లో. గుంజా రఞ్జిత కబరీభిః శబరీభి ర్గరీయసీ
నగరీ ఇహ నది ముక్తా వణిజః కోపి నముక్తాగుణజ్ఞోపి॥ 22

మ. అరుగు న్నిబిడి రాత్రి, దిక్కులిఁక వెల్గారుఁ జలేజాప్తుచేఁ
జిర మేదేనడవిఁ జకోరతతియుం జేరుఁ, మహాదారుణో
ద్ధుర సూర్యాంశు శిఖల్ చెలంగు జగమందుం గల్పతండంబు నె
వ్వరి పాల్జేసి నభోంతమం దెసఁగెదోః వాకొమ్ము, జైవాతృకా॥

శ్లో. యాతే యం భవతాసహేనీ రజనీ భావీ వికాసో దిశామ్
సూర్యేణాపి. చిరం చకోరనికరః స్థియః క్వచి త్కానవే
ఉద్యద్దారుణ చణ్డభాను కిరణజ్వాలే జగన్మణ్డలే
కస్మై త్వ చన్ద్ర సమర్ప్య కైరవకులం వ్యోమా న్తమాలమ్బసే॥ 23

గీ. శీతలను బగులఁ గొట్టెడు నిర్దయునకె
నీదు నీరము లభియించు. నేను బడయ
నేర'నని చిల్కకూన యెంతేని వెతలఁ
గనెడు. నోనారికేళమ! కఠినరూప!

శ్లో. భో నారికేళ, తవ మస్తక భేదకానాం
సాధ్యం భవే త్తవజలం కఠినస్వరూప

నాహం త్వదీయ సలిలగ్రహణే సమర్థః
త్వత్యంత ఖేవ విముఖ శ్శుకరాజపోతః 24

గీ. స్వాదుకిసలయ, మణిశిఖ సక్త సుమము,
నైన సహకారంచబృంహము మాని, తిక్త
చిత్త, మాబలిభుక్కులాంచితము, వేము
నందు మౌనానఁ బికబాల యుండు వేల?॥

శ్లో. సంత్యజ్య, కోకిలశిశో, మధురప్రవాళం
మాకన్దబృన్ద మళిపోత మిళత్ప్రసూనమ్
నిమ్బేషు తిక్తహృదయే బలిభుక్కులాఢ్యే
మౌనేన తిష్ఠసి యదీహ వదాళు కార్యామ్॥ 25

ఉ. అంజన తోయ బుద్బుద కణాభ శిరంబునఁ బుట్టి, యాయసం
పుంజిగి గల్గు త్రోటిపుటముం గల కాకముఁ జూచి, నిల్వఁ, బో
వం, జలియింపఁ, గన్నుఁదెఱవ, న్వెస మూయఁగఁ, జావ, జీవిత
ముం జరుపంగలేక భయముం గని కోకిల యాకులంపడున్॥

శ్లో. జాత న్నంబుజ తోయ బుద్బుద కణ ప్రాయం స్వకంమ స్తకం
పశ్య న్నాయస కూట కోటి ఘటిత త్రోటీపుటం వాయసమ్
నస్థాతుం, నపలాయితుం, నచలితుం, నోన్మీలితుం. మీలితుం
నోత్కర్తుం, నచజీవితుం ప్రభవతి త్రాసాకులః కోకిలః॥ 26

ఉ. ధాతవు, లోకరక్షణ విధాత, వెలుంగుదు నాయవస్థ, నిజ
ప్రీతి నభస్థితుణ్ శరణు వేడితిఁ, ద్వ్యక్తగృహుండ, దీనుఁడన్

జాతక బాలకుండ, స్పృహ చాలక యీనదియొడ్డుఁ జేరి, లీల
ఈతటి, నాదునోటఁ గృప యేర్పడ నీరము నింపు మంబుదా!॥

శ్లో. భో భో వారిద వారిణా మమముఖం సమ్పూరయ ప్రేమవాన్
దాతా త్వం జగదేకరక్షణపరో జానాసి మామప్యలమ్
త్వామేకం శరణంగతం నదనదీకూలేషు ముక్తస్పృహం
దీనం చాతకబాలకం నిజగృహం త్యక్త్వాన్తరాలే స్థితమ్॥ 27

గీ. కడలిమణులకు విలువయెయ్యెడను లేవొ,
వానివెల గట్టువారేస్థలాన లేరొ
యల్ల పల్లవపల్లిని గొల్లచెలులు
పద్మరాగంబు మూఁడుగవ్వలకుఁ గొంద్రు

శ్లో. సర్వస్త్రిరత్నాని సముద్రజాని పరీక్షకా యత్ర నసన్తిదేశే
ఆభీరపల్ల్యంచిత పద్మరాగం త్రిభిర్వరాటైః పణయన్తి గోప్యః 27

చ. భ్రమరము చిత్రమందుఁగల పద్మముఁగాంచి, ముదాన, దాని వ
ర్ణము మధురాకృతిన్ మివులఁ బ్రస్తుతిచేయుచుఁ జేరవచ్చి,గం
ధము మధుసంచయంబు మృదుతంగన, కయ్యెడఁ దత్తరంపుఁజి
త్తమున మొగంబువంచి, త్రపదార్కొన నేగె మఱొక్క చక్కికిన్॥

శ్లో. దృష్ట్వాహృష్టో భవదలిరసౌ చిత్ర సంస్థేన పద్మే
వర్ణంరూపం కిమితికిమితి వ్యాహరన్నాజగామ
నాస్మిన్గంధో నచమధుచయో నాస్తితత్సౌకుమార్యం
ఘూర్ణంఘుర్ణన్నవనతముఖో వ్రీడయా నిర్జగామ॥ 28

మ॥ మొదలన్నిడను, నంటఁబూల, నట నిం పుంగూర్పు పండ్ల న్మాటం
బొదవం జేయు కుజంబుగా యనుచు డాయుం బాంథలోకంబుల
గ్రదిశ న్దొత్తువసించి హాలహాల తీవ్రజ్వాలలం గ్రక్కునా
విదితోగ్రాతికరాళ ఫాలఫలకా భీలాహి నెట్లారయుదు॥

శ్లో. ఛాయాభిః ప్రథమం తతశ్చకుసుమైః పశ్చాత్ఫలైః సాధుభిః
ప్రీణాత్యేషతరో ర్మహానితి పరిశ్రాంతైస్సమాసాద్యతే
కోణానాతి యదగ్రకోటరపుట ప్రత్యగ్రహాలాహల
జ్వాలాజాల కరాళఫాలఫలకః క్రూరః ఫణీ వర్తతే॥ 29

గీ. ప్రతిపురంబును బ్రతిరథ్య బహుభుజంగ
నిలయ సంరుద్ధ సంచారకిలన, నాదు
సకియ! నకులంబు నెపుడును సాకుచుంట
మేలె, యత్యంత సమ్మతమే, తలంప॥

శ్లో. ప్రతినగరం ప్రతిరథ్యం భుజఙ్గ సంవాసరుద్ధ సంచారే
మమసఖి సమ్మతమేతత్ నకుల ప్రతిపాలనం శ్రేయః 30

చ. ధరమృదువయ్యెఁ, గాననము దాలిచెఁ జామనఁబచ్చచాయగి న్
నెరవుకొనె న్సుదుల్నదుల నీలపుమబ్బుల నిండెనింగి, సం
బరమును గూర్చెనన్నియును ద్వ్యజ్ఞననంబునఁ, గాని దుర్ణయం
బరసితె? భేకపాళిరొద లాపికవర్గ విరక్తి భావము న్॥

శ్లో. స్నిగ్ధాభూదవనీ. వనీ మరకతశ్యామాచకల్లోలినీ

# ప్ర క్షి ప్త ము లు

నానావర్తవిహారిణీ జలధరస్యాంశైర్నభో మేదురమ్
సర్వం సాధుతపోదయే కిమిహాయ ద్దుర్నీతి మాలోకయే
యద్భేకాముఖరీ భవంతి విరసీభూతాశ్చ పుంస్కోకిలాః॥ 31

క. అంతశ్ఛిద్రములున్వెలి
నంతటఁ గంటకములున్న యంబుజనాళం
బింతయు భంగురగుణ సం
క్రాంతము గాకుండుటెట్లొ ప్రాజ్ఞవరులకున్ ॥

శ్లో. అన్తశ్ఛిద్రాణి భూయాంసి కణ్టకాబహవో బహిః
కథం కమలనాళస్య మాభూవన్ భంగురా గుణాః 32

క. మదగజరాడ్గండస్థలిఁ
బదనగు నఖరముల శైశవంబునఁ జీరం
గఁదివురు కేసరి, ప్రాయపు
టదనున నిపుడెందుఁ జూపనగుఁ బౌరుషమున్ ॥

శ్లో. యేనశైశవపదేమదేభరా ఢ్గండసీమ్ని నఖరై ర్విదారితమ్
యౌవనోత్సవ మవార్యకేసరీ క్వేషు దర్శయతి సోద్యపౌరుషమ్॥ 33

క. ధరణిప భవనంబులఁబం
జరములఁ గట్టువడెఁ బౌరుషము వోవఁగఁ గే
సరి, యున్మిష దిభకరటులఁ
గర జార్పణ వినోదకరు లిఁక నెవరో ? ॥

శ్లో. భూమిపాలభవనేషు కేసరీ పంజరేస్ఫురతి రుద్ధపౌరుషః

ఉన్మిషత్సు కరిజేషు కుషిష్వనాం కః కరోతి కుజాప్పోత్సవమ్ 34

క. విరహాండగు నిసునివెతలను
నరవిందము లెఱుఁగు, సహహా! యన్యానికహా
స్కరునికిఁ గలయంతర, మే
వరుసను దెలియంగఁ జాల, భావమునందుజా ॥

శ్లో. అపవిద్దాని విద్ధంతి వ్యథాం విరహతో రవేః
తేషాం విరహతస్తస్య సజానే కీదృగన్తరమ్ ॥ 35

ఉ. భూరిఫలాధిరాజమయి పొల్చురసాలము మేల్మిఁగాంచి, యా
నేరెడు నల్లనయ్యెఁద్రప, నెట్టన దాడిమ గుండెవ్రీలెఁ, జే
కూరెను శూల యాపనసకు, న్మొగమం, దభిమానమేఁగ; నా
నారికడంబు మ్రానికొన నక్కెను నీరిడి లోన భీతిచేఁ॥

శ్లో. త్రపా శ్యామా జమ్బూర్దళితహృదయం దాడిమఫలం
సశూలం సంధత్తే హృదయ మభిమానేన పనసః
భయాదన్తస్తోయం తరుశిఖరజం లాంగలిఫలం
సముద్భూతేచూతే జగతి ఫలరాజే ప్రసరతి॥ 36

ఉ. సైరిభయూథము ల్గలఁచు స్వైరముగాఁ దమకొమ్ములన్ సరో
వారము, బెబ్బులుల్ హరిణవర్గము హుంకృతిఁ బాఱద్రోలు, నా
ఘోరవనస్థలిన్ హరి యకుంఠిత శౌర్యమునం బవళింపగా
దీఁగు చిత్రలేఖనము తీరున నొప్పెడు శబ్దహీనమై ॥

# ప్ర క్షి ప్త ము లు

శ్లో. స్వైరం సైరిభయూధపై రిహ సరశ్శృంగేణ విక్షోభితం
బాపన్యంకుకులంచ హుంకృతిశతై ర్విద్రావితం ద్వీపిభిః
హేలాక్షిప్తపదే పరాక్రమవిధా వ్యుజ్జృంభమాణే హరౌ
చిత్రం సైవ తథైవచిత్రలిఖితే నాసీ దరణ్యస్థలీ 37

గీ. నూఱఁబడియును, బాములకోఱఁబడియు,
విదళితమవయ్యు, ఛిన్నము భిన్నమయ్యు
ఘనము దాల్తు లోకోత్తర సౌరభంబె
చందనమ ! నీను శాంత మేమందు మహహా॥

శ్లో. పిష్టోపిదష్టోపిచ కాలసర్పైః ఛిన్నోపి భిన్నోపి విదారితోపి
కిం బ్రూమహే, చన్దనసౌమ్యతాంతే లోకోత్తరం సౌరభమేవధత్సే 38

మ. ఎది యాఁడేనుఁగులగర్భముల్ స్వయముగా నెంతేఁ బ్రిదిల్చెన్, సము
న్మదదంతావళ గండభాగజలముం దాఁబుక్కిలించెన్, భయా
స్పదగర్జారవముం బొనర్చి, మును, నాపంచాస్య యౌరా ! జరా
పదకుం దావయి, యోర్చు నిప్డు హరిణీవర్గంబు గేలిం గొనన్॥

శ్లో. గర్భాన్ స్వతో విదళయంతి కరేణుకానాం
గండూషయన్తి గజగణ్డ తటీమదామ్భః
యద్గర్జయంతి జరయా ముషితస్స ఏవ
కణ్ఠీరవః పరిభవం సహతే మృగీభ్యః॥ 39

ఉ. ఓయిమహవ్రతా ! విహగ నుల్లమునన్ వగఁ గూలనేల? ప్రా
లేయదినంబులెల్ల వెదలించితిఁ బెక్కులతాళి నంచు, నీ

కలుష గలిగించెదవు. విషయూశి నుండి
తొలఁగెనని యొర్లెఁ, పట్టెను. జలదయంద ! ॥

శ్లో. అయితోఽపి తత స్తతః పృథివ్యాం
వయి జీమూత జనస్య జీవనేన
విషయానపి గచ్ఛతః కిమేతాన్
ధ్వనిభి ర్భీషయసీహ రాజహంసాన్ ॥ 43

సీ. చవిటిభూముల వివరాల జలముఁ గొంపె
పేనిఁ జిమ్మెదు, పంటలనిడెడు నేల
నిన్ను జలబిందులను రాల్చ విట్టిగుణము
తగునె? యనయంబుగను జలధరుఁడ ! చెపుము

శ్లో. ఊషరేషు వివరేషు చాంభసాం వీచయోఽపి భవతా ప్రవర్తితాః,
క్షేత్రసస్య నిహతా స్తు బిందవో నార్జితాహ, భవతో నవానయ 44

మ. జలరాశిం గల యుప్పునీరమునె యాస్వాదించి, శోకార్తు పీ
యిలఁదాపంబు, ఘటింతు ముత్తెమును నెంతే శుక్తియం దంబులన్
బొలయున్నింతువు. చందనాది తరులం బుట్టింతు లేఁబల్లవాల్
జలవాహా ! బ్రతికింతులోక, మెవఁ డెంచంజాలు నీ సద్గుణాల్ ॥

శ్లో. తాపం సంప్రతి సర్వతోపహరసే ముక్తాఫలం శుక్తిషు
క్షేత్రం సించసి కించపల్లవయసి శ్రీ ఖణ్డముఖ్యాన్ ద్రుమాన్
క్షారం క్షారమిదం జలం జలనిధే రాస్వాద్య జీమూత హే
విశ్వం జీవయసి ప్రపీతి జగతి ప్రోథోపికస్తే గుణాన్ ॥ 45

## అన్యోక్తి సముల్లాసము

గీ. నేలపై నీటి చినుకులు రాలవిన్ని
దిక్కులం గల్గు పేంద్రధంబు దీఱవింతి
బలుపుమీఱుచు రైతుజీవాతువగుచు
మోదమెసలార మెఱయు నీ మెయిలందేల?

శ్లో. పపాతపాథః కణికా నభూమౌ నసూపణా స్తిం శకుభాంనతాపః
పుష్టైవజీవాతురయంతటిత్వాన్ కృషీవలానాం ముచముద్వవాస॥ 46

గీ. కలుగఁ జేయుదు పరుషభేకముల రొదలు
రమ్యకోకిల రుతము ల్నిరాకరింతు.
క్రోల వాకాశనది నీటఁ, గొనెదవుప్పు
నీటఁ, బర్జన్య ! నీ తెల్వి తేటపడియె॥

శ్లో. సంపాతస్సపది దర్దురదీర్ఘనాదో
యన్మంజుకోకిల రుతాని నిరాకృతాని
నిష్పీతమమ్బు లవణం నతు దేవ నద్యాః
పర్జన్యతేన నకృతో భవతా వివేకః 47

గీ తమ్మియెడఁ గల పక్షపాతంబు వీడి
యకట! కుటజంబు ననురాగ మారఁగనెదు,
జలద ! విశ్వైక జీవన చణుఁడవయ్యు
నబ్బురమె పెనుగాడ్పున కణఁగియుంట॥

శ్లో యత్రాద్ర్యశేషు నలినేషు నపక్షపాతో
జాతో బతస్ఫుట మసౌ కుటజానురాగః

విశ్వైకజీవన పుపోపిచ వారివాహ
దుర్వార వాయువశగోసి నతద్విచిత్రమ్॥ 48

గీ. మందు చండాంశు కిరణముల్ మాడ్చివేయఁ
గ్రాఁగు నీగొప్ప ప్రాఁకులఁ గరుణఁజూచి
యాశ్రయం బిత్తురెపో?లః, నంబుధరము
జగతిఁ దొరఁగి పయోధి వర్షంబు గురియ॥

శ్లో॥ ఉద్దామద్యుమణి మయూఖ మూర్ఛితానా
మేతేషా మహహ మహామహీరుహాణామ్
ఆలమ్బః క ఇహ భువస్తలే పయోధే
స్సిఞ్చన్తం జగతి విహాయ వారివాహమ్ ॥ 49

గీ. కృష్ణపక్షమున విధుఁడు చిక్కినను మేలె
పూర్ణతను నున్న జలనిధి పొగడఁబడఁడు,
అంబునిధి నీరమును దాఁకఁడల్పుఁడేని,
క్రతుభుజులఁ గూడ శశిసుధారస మలరు॥

శ్లో. శ్రేయో న్విధోర్బహుళపక్ష పరిక్షయోపి
నోపూర్ణతా జలనిధేరిహ వర్ణనీయా
యద్వారి నస్పృశతి హన్తపృథగ్జనోపి
యస్యామృతే సుఖభుజోపి ముదం లభన్తే॥ 50

చ. కుతుకము కామినీప్రియులకుఁ, విరహార్తులకెల్ల దైన్యముఁ,
వెతలల చక్రవాకులకు నిండుసుఖంబు చకోరపాళి కా

రాజా రాజతి కేవలం హిమకరః పుష్ణాతి దూరస్థితాన్
జ్యోత్స్నాభిః గ్లపితా న్దినేశ మహతా యోషౌ చకోరానిమాన్॥ 53

సీ. అవనిం దాపము దూఱుమాపుదువు, ధారాసారమున్నింతువు, క్షే
త్రవసుల్ మొల్కలఁ బెంతువు, నీపముల నుత్పాదింతు మొగ్గల్ నభం
బవలోకించెడు చాతకంబునకుఁ దోయంబింత దంచూవుటన్
నవులం జేయవదేమి? వానియపరాధంబేమి? యోయబ్దుదా!

శ్లో. సన్తాపం జగతాం విలుంపసి పునః ధారాభిరాసించసి
క్షేత్రాణ్యంకురయస్య నూన్ముకుళయస్యహ్నీయ నీపద్రుమాన్
సారంగస్య నభో నివేశితదృశః శ్చంచూపుటా పూరణే
వైముఖ్యం వ్రజసి త్వమంబుద యది ప్రత్యోతికోనామతత్॥ 54

ఉ. వేసవియుష్మవిచ్చె, వనవీధి వికాసిలెఁ, గొండపిండు ధా
రాస్మృతిఁదోఁగె, దావముదొరంగి, వెనల్ దెలివొందెఁ, గేకులు
ల్లాసతనాడె, నున్నతిఁ జెలంగఁ ద్రిలోకహితుండు వారిదుం,
డాసుకృతుల్ శరద్ఘనునిదంచు భ్రమన్ వచియింతురెల్లరున్

శ్లో. గ్రీష్మోష్మాపశితో వనం వికసితం ధారాభిషిక్తాధరా
దావాగ్నిశ్శమితో హరిత్సురసత్త్తై రానర్తితాః కేకినః
ప్రాపోచ్చైః పదమమ్బుదేన విదితం యచ్చైవత్రిలోకీహితం
తత్కీర్తిం పరివర్తితా మిహశరన్మేఘం వహన్తి భ్రమాత్॥ 55

క. పనమెల్ల నెడలె మధుపము
గనఁగొని మెఱ న్రూఁకులన్ని, కాని, జనతి, సీ

కెనయగు తరువెందును గాం
చనిదై నినుఁ జేరెఁ గడకు సహకారంబా!

శ్లో. గాహితమఖిలంగహనం పరితో దృష్టాశ్చ విటపినః సర్వే
సహకార న ప్రపేదే మధుపేన భవత్సమం జగతి॥ 56

గీ. క్షీరముంబలె, సుజనుండు సేయుమేలు
సత్వరము దిగమ్రింగి, తా జంతువిడిచి,
యతనిఁ జంపఁ గృతఘ్నుఁడై జతనపడును
బుకమి కాకోదరసహోదరుఁడు ఖలుండు॥

శ్లో. కృతమపి మహోపకారం పయ ఇవపీత్వా నిరాతఙ్కః
ప్రత్యుత హన్తుం యతతే కాకోదరసోదరః ఖలో జగతి॥ 57

శా. పాండిత్యమ్ముత్యజించి, వందికృతి నల్పంగంటి మెవ్వానికిఁ
మెందౌక్లేశములంది గొప్పతనమెంతేఁ గూర్చినా మేని, తా
తందే పూర్వహితంబులన్మఱచి, వ్యత్యస్తక్రియాబుద్ధి మా
యందం జూపఁగ నేమనంగలము మే మయ్యారె! యెవ్వారికేఁ॥

శ్లో. పాండిత్యం పరిహృత్య యస్యహికృతే వందిత్వమాలంబితం
దుష్ప్రాపంమనసాపి యో గురుతరైః క్లేశైః పదం ప్రాపిత
రూఢ స్త్రిత్రసచేన్నిగిర్య సకలాం పూర్వోపకారావళిం
దుష్టప్రత్యవతిష్టకే తదధునా కస్మై కిమాచక్ష్మహే॥ 5

క. కాపట్య దోషుఁడగు ఖలుఁడా పదగలిగించు నంచు నలమిన శంకఁ
వేపాయుదు రెల్లరుఁ గరళోపేతాశీవిషముటు లొగి దూరముగఁ.

# ప్రక్షిప్తములు

శ్లో. ఖలః కాపట్యదూషేణ దూరేణైవ విసృజ్యతే
అపాయశంకిభిర్లోకైః విషేణా శీవిషో యథా 59

సీ. ఖలుఁడ! మహితవివేక భాగ్యకలితుండ
పలుకఁదరమౌనె నీగుణ పక్షపాత
మరరె! మఱపవుగద నీ వహర్నిశంబు
సాధువర్తనులం దొక్క జనుని నైన॥

శ్లో. కిమిహం వదామి ఖలు దివ్యమతే గుణపక్షపాతమభితో భవతః
గుణశాలినో నిఖిల సాధుజనాన్ యదహర్నిశం నఖలు విస్మరసి 60

ఆ. ఖలుఁడా! బుధజనములకడఁ
బలుకుదునో; విశదఫణితిఁ ద్వత్కృతులెల్లన్,
గలుషాత్మ! కానిచో, నీ
యలుపకతలు పలికినట్టి వవి చాలునొకో!॥

శ్లో. రేఖల తవ ఖలుచరితం విదుషాం మధ్యే వివివ్చవక్ష్యామి
అథవాలం పాపాత్మన్ కృపయాపి తేహతయా॥ 61

క. ఆనందమృగదవాగ్నియు, మానితశీలావనిరుహ మదకుంజరమున్,
జ్ఞానామలదీపాతిశమానిలమగుఁ జువ్వె ఖలసమాగమ మరయన్॥

శ్లో, ఆనందమృగదవాగ్నిః శీలశాఖిమదద్విపః
జ్ఞానదీపమహావాయు రయం ఖలసమాగమః॥ 62

## అన్యోక్తి సముల్లాసము

క. దోసఁగెఱుఁగని జీవంబుల
యసువులఁ బాపంగనేర్చు సహులంబలె. స
ద్వ్యసనరహితముల సతం త్ర
త్యసమానపుఁ గృతుల నిపుణు లవినీతులిలన్

శ్లో. ఖలాస్తు కుశలాః సాధుహిత ప్రత్యూహకర్మణి
నిపుణాః ఫణినః ప్రాణానపహర్తుం నిరాగసామ్ ॥ 63

క. హితుఁడ ! మహోన్నత కార్యము
లతిశయముగఁ జేసినాఁడ, వమలయశం. బా
తతముగఁ గనినాఁడవు. సు
స్థితియావజ్జీవమిదిగో ! దీవింతుము నిన్ ॥

శ్లో. కృతః మహోన్నతం కృత్యమ్ అర్జితశ్చామలంయశః
యావజ్జీవం సఖేతుభ్యం దాస్యామో విపులాశిషః ॥ 64

క. పరకృతిరతులగు సుజనో
త్తరులవచోమృతము మధురతరమును, హృదయాం
తరమల పారావారము,
శరదిందుకిరణ సమంబు సద్యశమెన్నన్ ॥

శ్లో. అవిరతం పరకార్య కృతాంసతాం మధురిమాతిశయేన వచోమృతం
అపిచమానసమమ్బునిధి ర్యశో విమలశారద పార్వణచంద్రికా 65

క. అరుదెంచె వసంతంబిఁకఁ జిరమడఁగిన నాదుగీతి చెలఁగునటంచున్
ముదియూతటిన్ మధి, బికమును

# ప్రక్షిప్తములు

శరముస పడి బోయఁడేసి చంపెఁ గటకటా!

శ్లో. ఏత్యకుసుమాకరో మే సంజీవయయితా గిరంచిరంమగ్నమ్
ఇతి చింతవతో హృదయమే పికస్య సముధాయి శౌభిగేన శరః॥ 66

క. బహిరాడంబరముల గుణ
రహితుండెటు శోభఁగను, గరంబపుడ సుమో
గ్రహానపుసిరి గల బూరుగు
రహియించునె? పరిమలము విరాజిల్లనిచోన్॥

శ్లో. నిర్గుణ శ్శోభితేనైవ విపులాడమ్బరోపినా
ఆపాతరమ్య పుష్ప శ్రీ శోభితా శాల్మలీర్యథా॥ 67

క. అడుసుండని కొలనును, దుం
దుడుకులు నెలకొనని సదను, దుష్కటువర్ణం
బడరని కావ్యము, విషయము
లొడఁగూడనిమనసు గణుతినొందును ధరణిన్

శ్లో. పఙ్కైర్వినా సరో భాతి సదః ఖలజనైర్వినా
కటువర్ణైర్వినా కావ్యం మానసం విషయైర్వినా॥ 89

క. తానరహిత రాగమటుల్
మానరహిత చిత్తుఁడైన మనుజేశునటుల్
దానరహిత దంతియటుల్
జ్ఞానరహితయతియు వన్నెఁగనఁడు ధరిత్రిన్॥

శ్లో. యథాతానం వినారాగో యథామానం వినాన్నృపః
యథాదానం వినాహస్తి తథాజ్ఞాసం వినా ముసిః 69

క. సూనమరందము మెచ్చెడు
జ్ఞానిమధువ్రతుఁడె తక్కఁగాఁ దన్యుఁడు న
మ్మానితకావ్యపుఁ దత్వము
నేనూటికొ కోటికో గ్రహించునొకండే॥

శ్లో. తత్వం కిమపికావ్యానాం జానాతి విరళోభువి
మార్మికః కోమరన్దానాం అంతరేణ మధువ్రతమ్॥ 70

క. సరజస్కముఁ బాండురమును
ఖరకంటకయుతము నగుచుఁ గ్రాలెడు మొగిలిన్
నిరతము సేవింతువు, ఓం
భ్రమరా ! సిగ్గింతలేని బ్రతుకేల ? యయో !

శ్లో. సరజస్కాం పాణ్డువర్ణాం కణ్టక ప్రకరాన్వితామ్
కేతకీం సేవసేహన్త కథం రోలమ్బనిస్త్రప॥ 71

క. పరులకు నుపకృతి సేయఁగ
నిరతము మది నెంచుసుజననికరము వాక్కుల్

---

* క ఘనకావ్య తత్వమిదియని
మనమున గ్రహియించు నరుఁడు మహి నరుదుగదా !
యనితరమకరందమునం
దున మర్మంబెఱుఁగు, నొకమధువ్రతుఁడెగదా !

పరగును జేఁదవుమందుల
పరుసున నప్పటికి, మీఁదఁబరితోష మిడుఁ॥

శ్లో. అనవరత పరోపకార వ్యగ్రో భవదమలచేతసాం మహతామ్
అపాతకాటవాని స్ఫురన్తి వచనాని భేషజానీవ 72

క. భ్రమర సమూహము మధురత
రముగన్ ఝమ్మనుచుఁ దమ్ముఁ బ్రస్తుతి సేయన్
సుమహితవినయంబున శీ
ర్షములుర్వికి వ్రాల్చి వనిఁ కుజంబులు వొలిచెన్

శ్లో. వ్యాగుఞ్జన్మధుకరపుఞ్జ మఞ్జు
గీతాన్యాకర్ణ్య శ్రుతి మపజాలయాతిరేకాత్
ఆభూమీతల నతకన్దరాణిమన్యే
రణ్యేస్మిన్నయమవనిరుహాంకుటుంబకాని॥ 73

క. ఉత్తము రాంద్రకు సయితము
నెత్తఱి విశ్వాసమింత యెనఁగదు ధరలో
నత్తొగమగువలు రాజున
కత్తిన ప్రియలయ్యు వలచు, హా! మధుపతతిన్॥

శ్లో. ఉత్తమానా మపిస్త్రీణాం విశ్వాసోనైవ విద్యతే॥
రాజప్రియాః కైరవిణ్యో రమన్తే మధుపైస్సహ 74

గీ. మృతునియందాస, కృపణుని కిచ్చుటందు
మమత, చెడిపెకాదరణంబు మగనియందు

సర్పశాంతియుఁ గుటిలుని సఖ్యగుణము
నగపడెనె ? యింతదనుక నయ్యజునిసృష్టి॥

శ్లో. మృతస్యలిప్సా కృపణస్యదిప్సా విమార్గగాయాస్య రుచిస్వశాన్తే
సర్పస్యశాన్తిః కుటిలస్యమైత్రీ విధాతృసృష్టౌనహి దృష్టపూర్వా॥ 75

క. కడునుచ్ఛృంఖల విధికృతి
నడుగకయ సుఖంబులఁగురు. నావిధికప్పుడ
యడిగియు నమరవు. పైఁగా
పడఁగుఁజ సర్వస్వమవనియందు నరులకుఁడా॥

శ్లో. అయాచితస్సుఖంధత్తే యాచితశ్చనయచ్ఛతి
సర్వస్వంచాపి హరతే విధిరుచ్ఛృంఖలో నృణామ్॥ 76

మ. గురుదోర్దండ యుగాతిమండిత లసత్కోదండ చండాశుగో
త్కరవిధ్వస్త విపక్షమండలుని సంగ్రామంబునందు న్ననుఁజ
వరగాండీవ విముక్తకాండ వలయజ్వాలావళీ తాండవా
కరమౌ ఖాండవ మేచ్చు పాండవునిగా క్ష్మానాథు లూహించరే

శ్లో. దోర్దణ్డద్వయకుణ్డలీకృతలసత్ కోదణ్డచణ్డాశుగ
ధ్వస్తోద్దణ్డ విపక్షమణ్డల మథ త్వాం వీక్ష్య మధ్యేరణమ్
వల్గద్గాండివ ముక్తకాణ్డవలయ జ్వాలావళీతాణ్డవ
భ్రశ్యత్ ఖాణ్డవ రుష్టపాణ్డవ మహో కో నక్షితీశ స్మరేత్॥ 77

క. ఖండిత కనుఁదామరలకు
దండిముదముఁ గూర్చుటందుఁ దగఁబండితముల్

మండితములఖిల దిశలకుఁ
జండాంశుని భానుతతులు సాకుతమిమ్మా

శ్లో. ఖండితానేత్ర ఖంజాళి మఞ్జురఞ్జన పణ్డితాః
మణ్డితాఖిల దిక్ప్రాంతా శ్చణ్డాంశోః పాతుభానవః 78

చ. నలినమ! నీసువాసనఁగొనం జనుదెంచినతేఁటి యక్కటా!
బలితపు బందెఁజిక్కి, పిడివడ్డ తఱిన్ నినుఁగూర్చి గానమున్
సలిపెడుఁ, గాని నీధనము సర్వముదోఁచి, మరుత్తుసొంతపుం
గలిమిగఁ జాటుచున్ సురభి నా యశమందుట పాడియౌనొకో?

శ్లో. అలభత బత బన్ధం గన్ధ మాఘ్రాతుమాగా
ద్యదపి (తదపి) ముక్తోగాయతి త్వద్యశోలిః
తవసరసిజ సర్వస్వం సమాదాయవాయుః
సురభి రితి యశస్తు స్వీయ మావిష్కరోతి॥ 79

గీ. 'ధరణినాథుని మణిమయాంతర్గృహమ్ము
నాదియ' యటంచు గర్వమంధకు బిడాల!
నృపులపట్టాభిషేకంబు లపుడు బయటఁ
జెలఁగు కలభమ మండన శ్రీ రహించు

శ్లో. మాగర్వముద్వహ బిడాల, మహీపతీనాం
అన్తర్గృహం మణిమయం నిలయం మమేతి
పట్టాభిషేక సమయే మహీపతీనామ్
బాహ్యస్థితస్య కలభస్యహి మండనశ్రీ 80

క. ఏనుఁగు బందెంబడిక్కిన
దేనియు భరియింపఁజాలు విల వేగురనేఁ-
శ్వానము స్వేచ్ఛగనుండున
దైన న్నిండుకొన నేర దాత్మోదర మేఁ

శ్లో. బంధనస్థోపి మాతఙ్గః సహస్రభరణ క్షమః
శ్వాపిస్వచ్ఛన్దనిలయః స్వోదరం నైవ పూర్యతే॥ 81

చ. లలిత జలేజపాళి పొగలం దశదిక్కులఁ జల్లుచుండ, న
మ్మలయ సమీరణాల్ బెరసి మై దహియింపఁగఁ, గోకిలంబెటుల్
కిలరవ చంచరీకములు గల్గిన లేయెలమావి యాకులఁ-
బొలుపగునీవుఁగూడఁ గనఁబోని యెడ న్నయిచు న్వసంతమా

శ్లో. ధూమాయితో దశదిశా దళితారవిందా
దేహందహన్తి దహనా ఇవ గంధవాహాః
త్వామన్తరేణ మృదుతామ్ర దళామ్ర మస్తు
గుఞ్జన్మధువ్రత మహో, కిల, కోకిలస్య॥ 82

గీ. మూలమునఁ బాములుణ్, శిరమునఁ బులుఁగులు,
శాఖలను వానరములుఁ, బుష్పముల నళులుఁ
జందనకుజంబుఁ జేరి యాశ్రయము గాంచె
సుజనులప్రవృత్తి యెపు డన్యశుభముకొఱకె

శ్లో. మూలం భుజఙ్గై శ్శిఖరం విహఙ్గైః
శాఖాః ప్లవఙ్గైః కుసుమానిభృఙ్గైః 83

# అన్యోక్తిసముల్లాసము

సంసేవితే చందనపాదపోయం
పరోపకారాయ సతాంప్రవృత్తిః

గీ. బురదనీటిని గప్పలెప్పుడును ద్రావి
నిసుఁగఁ గటువుగ బెకబెకమనుచుఁ గూయు
క్రమమూకందరసము పికంబుగ్రోలి
ప్రమదమందక తియ్యని పాటపాడు॥

శ్లో. సపంకముదకం పీత్వా భేకో బకబకాయతే
దివ్యచూతరసం పీత్వా గర్వం నాయాతి కోకిలః 84

క. మలయాచలసంసర్గము
గలిగిన గందంపుమ్రాను గాదుగా, వెదురెటులుఁగా,
లలితాంతస్సారాపే
తుల కెవ్వానను, రసంబు దొరకరదు పుడమిఁగా

శ్లో. మలయాచల సంసర్గా న్నవేణు శ్చందనాయతే
అన్తస్సారవిహీనానాం రసః కేనోపజాయతే॥ 85

గీ. భ్రమర! యెచ్చటి మధువాని, రాత్రి యెచటఁ
గడపితివొ, యట్టిపద్మిని కాంతిహీన
యగుడు మఱచితి వెంతలో, నకట! దానిఁ
గాంచ వింతయు హిమసమాగమనవేళ॥

శ్లో. పీతయత్రమధు, యాపితానిశా భృఙ్గ, సర్వమచిరేణ విస్మృతమ్ 86
హీనసుమానసుషమాం హిమాగమే పద్మినీం యదిహ నావలోకసే

# ప్రక్షిప్తములు

క. పరిమళ బహుళగదాయని
దరియకు గేదంగిఁ, జనుము దవ్వగ, నిచటం
దొరకదు తేనియ, నోటన్
నెఱయు రజోధూసరంబె నిండుగ మధుపా॥

శ్లో. అపసర, మధుకర, దూరం పరిమళ బహుళేకేతకీ కుసుమే
ఇహ నహి మధులవలాభం భవతి పరం ధూళిధూసరం వదనమ్ 87

క. చందురు డుదయించెడు దను
కం దళుకుల మెఱుఁగుపురుగు గడుభాసించున్
గెందమ్మిచుట్టమటు పు
ట్టం దొలఁగు న్మెఱుగుపురు. గడంగును శశియుఁన॥

శ్లో. ఖద్యోతే ద్యోతతేరాత్రౌ యావన్నోదేతి చంద్రమాః
ఉదితేతు సహస్రాంశౌ నఖద్యోతో నచంద్రమాః 88

గీ చాతకమ! వ్యర్థనృత్యము సలిపెదేల?
కాలమేఘముగా. దది గంధగజము
దాని మదజల మతులకేజాసి యెప్పు
డిడదు నీవంటివారికింతేని నిజము॥

శ్లో. వృథాశథంనృత్యసి, చాతక, త్వం, అకాలమేఘోయ మిభోమదాన్ధ
నత్వాదృశేన దదాతికించిత్, మాతఙ్గదానం మధుపాశ్చ ఏవ॥ 89

గీ. 'వ్యాసుఁడగుఁగాక, గౌతముఁ డగునుగాక,
యాపతంజలి యగుఁగాక, యరయనెవఁడు

సాహితీవేత్త గాఁడట్టిజనున కెవుడు
మచ్చిరమువంచి యేను నమస్కరింప॥

శ్లో. వ్యాసతు నతు గౌతమతు వ్యాశేంద్రతు, యోనవేత్తి సాహిత్యమ్
తంప్రతి సంప్రతి కంప్రతి శిరోమదీయం పురశ్చన తిరశ్చన॥ 90

మ. బలిపుష్ట ప్రకరాంతరంబునఁ బ్రభఁ బ్రాసింనునేయంచ ? న
క్కలమధ్యంబున శోభనుం బొరయునే కంఠీరవంబుఁ ఖరా
వళిచెంతఁ వెలుఁగొందునే నృపతిసంభావ్యాశ్వరత్నం, బిఁకం
దలఁపం బామరమానవావృతుఁడు విద్వాంసుండు చెల్వారునే ?॥

శ్లో. హంసోనభాతి బలిభోజన బృన్దమధ్యే
గోమాయుమండలగతో నవిభాతి సింహః
జాత్యానభాతి తురగః ఖరయూధ,మధ్యే
విద్వాన్నభాతి పురుషశ్చ నిరక్షరేషు॥ 91

చ. అమృతమయాంగుఁ, డోషధుల కాయు వొసంగెడువాఁడు, తారకా
సమితికి ఱేఁడు, కాంతిచయసంయుతుఁ, డిందుఁడు నిల్వ సూర్యవృ
త్తమున నిమేషమేని నిజధామముఁ గోల్పడు, నట్ల యన్యగే
హమున వసించి లాఘవము నందఁడె ? యెంతటివాఁడునేన్ధరన్

శ్లో. ఉడుగణపరివారో నాయకోప్యోషధీనాం
అమృతమయ శరీరః కాన్తియుక్తోపి చన్ద్రః
భవతి విగతరశ్మిర్మణ్డలం ప్రాప్యభానోః
పరసదన నివిష్టః కోలఘుత్వం నయాతి ?॥ 92

# ప్రక్షిప్తములు

గీ. అల్పుఁ డెంతయు వదరుఁ గార్యంబుఁ గనఁడు,
సజ్జనుఁడొ పల్కకుండ గర్జములొనర్చు
శారదాంబుదములును, వర్షంబు నిడదు,
వార్షికపుమేఘములును నే వానఁగురియు॥

శ్లో. గర్జతి శరది నవర్షతి। వర్షతి వర్షాసు నిస్స్వనో మేఘః
నీచో వదతి నకురుతే। నవదతి సుజనః కరోత్యేవ॥ 93

గీ. పచ్చకర్పూరజమునఁ బాదుచేసి
మృగమదము చందనము చేర్చి యెరువుసైచి
యనుదినము పుష్పసారసేచనమొనర్చి
పెంచినను నుల్లి స్వగుణంబు విడువఁగలదె॥

శ్లో. కర్పూరధూళీ రచితాలవాలః కస్తూరికా చన్దనదర్పసుశ్రీః
పునఃపునః పుష్పరసేనయుక్తః ప్రాంచంగుణం ముఞ్చతి కిం పలాణ్డుః

క. దోయిటఁ గలుగు లతాంతము
లాయతగతిఁ గరయుగమున కామోదమిడుగా
బాయక సుమనస్సులకున్,
మాయురె! కుడియెడములన్ సమంబులె ప్రేమల్॥

శ్లో. అఞ్జలిస్థాని పుష్పాణి। వాసయన్తి కరద్వయమ్
అహో। సుమనసాంప్రీతి। ర్వామదక్షిణయో స్సమమ్ 94

క. కడు పరిచితమగుమస నవమతి
[illegible] సతిపి. బుజనుటఁ దొలఁగుం బ్రియము, మే

ప్పుడు మలయానం బోయెత
రిదుదురు గంధంపుఁగట్టె లిండ్లం బ్రొయుఁజా
శ్లో. అతిపరిచయా దవజ్ఞా। సంతతగమనా దనాదరో భవతి
మలయే భిల్లపురంధ్రీ। చన్దనతరుకాష్ఠ మింధనం కురుతే॥ 95

క. మృగరాజు సటాటోపము
బెగడిడు గర్జయుఁ దొరంగి వెల్గించు గిరిజా
మిగులం గీఁకలు వెట్టియు
నగునే మాతంగమునకు నటులొనరింపజా
శ్లో. అప్యకుర్వన్ సటాటోజ మగర్జన్నపి కేసరీ;
భూభృతం కురుతేశోభాం గర్జన్నపినకుఞ్జరః 96

గీ. ఒక్క పరిమళమునకె యీ నిక్కుటేల?
చెపుము, కస్తురి! పరిమళశీతలతలు
నమలతా సుకుమారత లమరివెల్గు
కర్పూరము వినయంబును గాంచలేదె?
శ్లో. మృగమద! మాకురుగర్వం పరిమళ మాత్రేణ తం త్వముపయాసి
పరిమళశీతలతా, నిర్మలతా స్సుకుమారతాచ కర్పూరే 97

క జలధరుఁడ! తపనుకిరణం
బుల వాడి, దవాగ్నిఁ గ్రాఁగి పొగిలెడితరులం
దిలకించి, యీవు కరుణ
సలిలము వెదచల్లి జీవసమితిం దాల్పుజా॥

# ప్రక్షిప్తములు

శ్లో. యేతపనకిరణ శుష్కా స్తదనుచ దావానలేన సందగ్ధాః
జరధర ! శిఖినో ప్యేతే త్వజ్జలసేకేన జీవన్తి 98

గీ. హిమకిరణమండలమ్ము దర్శింపలేని
తమ్మిజవరాలి జనువు వ్యర్థంబకాదె,
సుప్తిఁగను వారిజినిసొంపు చూడలేని
చంద్రునుదయముగూడ నిష్ఫలముకాదె॥

నిరర్థకం జన్మఫలం నళిన్యా యయా నదృష్టః తుహినాంశుబిమ్బః
ఉత్పత్తి రిన్దోరపి నిష్ఫలాహి దృష్టావినిద్రా నళినీ నయేన॥ 99

గీ. పయిఁడికొండైన వెండికొండయిన నేమి ?
భూరుహములట సామాన్య భూరుహములె.
మలయమే మలలన్నేఁటని మాతలంపు
ముష్టి, వేపయు నటఁ గంధపుంగుజములె॥

శ్లో. కిం తేన హేమగిరిణా రజతాద్రిణావా
యావాశ్రితా హి తరవ స్తరవ స్త ఏవ
మన్యామహే మలయమేవ నగాధిరాజం
శాకోట నిమ్బకుటజా అపి చన్దనన్తి॥ 100

గీ. కేకి ! యొకపింఛియపుటీక నాకొనంగ
వననయంబున నినువేఁడికొనియుఁ, గాని
తొమ్మపై బోయ డాకాలఁ ద్రొక్కిపట్టి
యొడిచికొనువేళ విధిలేక యిడవెయెల్ల

## అన్యోక్తి సముల్లాసము

శ్లో. రే రే శిఖావళ శిఖాభరణాయ బర్హా
మేకం దిశే త్వనునయా న్మమ, కిందదాసి ?
భిల్లాయ వామచరణం హృదయే విధాయ
నిర్లుఞ్చతే దిశసినిర్దయ మధ్యమానః 101



## శృంగార సముల్లాసము

క. అనుకంపా పూరితములు
నసురాగా కలితములు మహాచతురంబుల్
ఘనశీల శీతలంబులు
వనితల హృద్వర్తనము లపహరించు మదిన్॥

శ్లో. సానుకంపా స్సానురాగా శ్చతురాః శీలశీతలాః
హరన్తి హృదయం హన్త కాన్తాయాః స్వాన్త వృత్తయః॥ 1

క. తామరసేక్షణ నేఁ గడుఁ
బ్రేమ ననుభవించుకొలఁది వేదాంతమటుల్
వామన మవ్విటినుండియుఁ
దా మరలిచి యేకరసయుతం బొనరించెన్

శ్లో. యథా తథా తామరసేక్షణా మయా
పునస్సరాగం నితరాం నిషేవితా

తథా తథా తత్వకథేవ సర్వతో
విక్రుష్య మామేశరసం చకార సా॥ 2

చ. హరిణ విలోచనాముఖ మహాసుధారసపూరితంబు, సుం
దర రదనచ్ఛవిన్ హసితతాముసంబుగ నద్భుతాతి యు
త్తరముఁ బునరుక్తిఁగాఁగఁ గుముదప్రియబింబముఁ జేసెఁ బండితో
త్కర మింక నాతనిం బొగడదా? యవిటా! యవివేకచేష్టుఁడై

శ్లో. దన్తాంశుకాన్త మతివిస్తరమాపహారి
సాన్ద్రామృతం వదన మేణ
వేదా విధాయ పునరుక్త మిమేస్తుబిమ్బం
దూరీకరోతి న కథం విదుషాంప రేణ్యః॥ 3

క. బుధునాశ్లేషముఁ గాంచని
విధురాశామండలంబు విధి నాసికయం
దధిగత మౌక్తికమగు చెలి
మధురానన మతికళా సమంచిత మవురా?

శ్లో. విలసత్యాననం తస్యా నాసాగ్ర స్థిత మౌక్తికమ్
అలక్షిత బుధాశ్లేషం శాశేన్దో రివమండలమ్॥ 4

గీ. దంతకిరణప్రభలు గప్పి తమ్మిసిరుల
నపహరించు కురంగాక్షి యమృతపూర్ణ
ముంబు మెసఁగఁ బునరుక్తిగఁ బూర్ణచంద్రుఁ
జేసిన విధాత బుధులు దూషింపరెట్లు?

# ప్రక్షిప్తములు

గీ. అల్లనల్లనఁ దూఁగాడు నలకరాజి
చకితనయనాంబుజంబుతో సరసమూర
యువరు లెదఁ గొనుచుం బ్రియు భవనమునకుఁ
జనెడు చెలినడక లెవని మనముఁ గొనదు ?

శ్లో. లోలాలకావళి చలన్నయనారవింద
లీలా వశంవదిత లోకవిలోచనయాః
సాయాహ్ని ప్రణయినో భవనం వ్రజన్త్యా
శ్చేతో న కస్య హరతే గతిరంగనాయాః॥ 5

క. హరిణాక్షి గృహిణి యెయ్యెడఁ
బరఁగదొ యాయింట నెన్ని భాగ్యములున్నన్
అరయఁగ నిరర్థకములగు
పరికింపఁగ భవనమది యపాడవు వనమున్

శ్లో. హరిణీ ప్రేక్షణా యత్ర గృహిణీ నవిలోక్యతే
సేవితం సర్వసంపద్భి రపి తద్భవనం వనమ్॥ 6

క. చలదళియగు నంభోజము
వలె విత్తరి చూపులొలయు వనితాననముం
బిలకింప ననంగుఁడు మి
క్కిలికోపముఁ దాల్చె నింకఁ గృత్యమదేమో ?

శ్లో. చలద్భృంగ మివామ్భోజ మధీరనయనం ముఖమ్
తదీయం యది దృశ్యేత కామః క్రుద్ధోస్తు కింతతః ? 7

క. ఈలాగు నాదుననువులఁ
దూలించుట హాలహాలముతోఁ దుల్యుఁడవై
క్రాలెదు నిను. జడుఁ డెవ్వం
డోలి 'సుధాంశుఁ'డని పల్కెనొక్కో? శశాంకా॥

శ్లో. ప్రాణాపహరణేనాసి తుల్యో హాలాహలేన మే
శశాంక కేన ముగ్ధేన సుధాంశు రితి భాషితః॥ ౪

గీ. సకియ దయితుఁడు దైవవశాన నాదు
చూపులకు దూరముగ నెంతసేపు గడపు
నంతసేపును దమదు కృత్యములయెడల
నాస్థఁ గన వించుకేని నాయంగకములు॥

శ్లో. యదవధి దయితో విలోచనాభ్యాం
సహచరి దైవవశేన దూరతోభూత్
తదవధి శిథిలీకృతో మదీయై రథ కరణైః ప్రణయో నిజక్రియాసు॥

గీ. దూరదేశాగతుండైన నారమణుఁడు
గడపె రేయెల్ల నెన్నియో కతలతోడ,
నధికముగ నింక నేనుమాటాడఁజాల,
చెలియ! నీనాల్క యిసుమని పలుకకమ్మ!

శ్లో. నిఖిలాం రజనీ ప్రియేణ దూరాత్ ఉపయాతేన విబోధితా కథాభిః
అధికం న హి పారయామి వక్తుం సఖి మా జల్ప తవాయసీ రసజ్ఞా॥

# ప్రక్షిప్తములు

క. కన్నీటి చాలు నిలుపుగతి న్నిశ్చలత న్వహించి తనరెడు తారల్
చెన్నొందుమృగీదృశ నయనోన్నిద్రేందీవరములు నొగిమఱతునొకో

శ్లో. నిపతద్బాష్పసంరోధ ముక్త చాఞ్చల్యతారకమ్
కదా నయన నీలాబ్జ యాలోకేయ మృగీదృశః 11

క. హరిణాక్షి, మదాలోకనసరణిం బడదేని నాదు జడజీవితమేఁ
గరపు విఫలమగు, జగమేఁ బరికింపఁగ వ్యర్థమేసుమా సౌమిత్రీ

శ్లో. యది లక్ష్మణ మామృగేక్షణా న మదీక్షాసరణిం సమేష్యతి
అమునా జడ జీవితేన మే జగతా వా విఫలేన కింఫలమ్॥ 12

గీ. బాల తనసదనముఁ జొచ్చువేళ, నామె
వీడుకొని యేఁగనెంచిన కోడెకాండ్రు
దారి నెసలార, వేడ్కమై వారిపయిని
లీల నాలోకనాంబుజమాలఁ బఱపె॥

శ్లో. భవనం కరుణావతీ విశన్తీ సమనాజ్ఞా లవలాభ లాలసేషు
తరుణేషు విలోచనాబ్జమాలాం అథ బాలా పథి పాతయాం బభూవ

క. తెలతెలవాఱంగ, సవతి యిలువిడి, తనుఁజేరుప్రియుని నీక్షింపఁగతే
లలితైణనేత్ర కనుఁగొలుకుల నరుణద్యుతులు చుట్టుకొనియెన్ వేగన్

శ్లో. ఉషసి ప్రతిపక్షకామినీ సదనా దంతిక మంచతి ప్రియః
సుదృశో నయనాబ్జకాణయా రుదియాయ త్వర మారుణ ద్యుతిః 14

గీ. విధికృతిఁ మోసపోయితి, చెడలన్నె తిఁ
ప్రియుఁడు సెప్పిన సంకేతవేశ్మమునకు,
నృపతి కాముండు నా కిప్పుడేమి సేయ
నెంచినాఁడో? కటా! యింత యెఱుఁగఁగలనె?

శ్లో. విధి వంచితయా మయానయాతం
సఖి సంకేతనికేతనం ప్రియస్య
అధునా బత కిం విధాతు కామో
మయి కామోన్నృపతిః ప్రసన్నజాయతే॥ 15

క. అవిరళ మౌక్తికతారయు ధవళాంశుక చంద్రికయు, నితాంతకాంచ
త్స్వవదన పరిపూర్ణసుధాంశువు రాకానిశయె నిజము సుందరియెన్నన్

శ్లో. సువిరళమౌక్తికతారే ధవళాంశుక చంద్రికా చమత్కారే
వదన పరిపూర్ణచంద్రే సుందరి రాకాసి నాత్ర సందేహః॥ 16

గీ. తళుకుఁ గనుబేడిసలును బొక్కిలిసుడియును
నెఱికురులసర్పముల్ గల నెలఁతమిన్న
మేనుదాల్చిన దుస్తరమైన తటిని
సుజనులే గ్రుంకు వార లుత్సుకత నందు॥

శ్లో. రూప జలాచల నయనా నాభ్యావర్తా కచావళిభుజఙ్గా
మజ్జన్తి యత్ర సంతః సేయం తరుణీ తరంగిణో విషయా॥ 17

గీ. తరుణి! నీవదనాంబుజాతంబునందుఁ

## ప్ర క్షి ప్త ము లు

గెంజెదవి కాంతులం గూడి యింబుఁ గూర్చు
సబవటున రుచులు కేసరముల తెఱఁగున
నెంతయుం వెలుంగుచు హరించి హృదయమహహా !॥

శ్లో. శోణాధరాంశు సంభిన్నా స్తన్వి తే వదనాంబు జే
కేసరా ఇవ కాశ న్తే కా న్త దన్తాలి కాంతయః॥ 18

క. క్షమ నొసఁగుటందు ముఖ్యప
దములగు పదములఁ బ్రియుండు దాఁ బడినంతన్
గమలాస్య కనుల యెఱ్ఱఁద
నము దొలఁగెన్, వెంటనే మనము వికసించెన్॥

శ్లో. క్షమాపణై కపదయో పదయోః పతతి ప్రియే
శేముః సరోజవదనా నయనారుణ కా న్తయః 19

మ. పలుతప్పుల్ దలపోయుటం గలుగు కోపానం, గురంగాక్షి వ్యా
కులయై యుండఁగ, నంగనాజన ధృతిం గూల్పన్ సమర్థంబు, కో
మలమౌ శ్రీహరి మేనికాంతి యట రమ్యంబౌచుఁ గన్పట్టెఁ, ద
ల్లలనారోషము, నప్పుడే మెఱుపులీలం బాసి యేఁగెన్ జామీ ॥

శ్లో. నిర్వాసయంతీ ధృతి మంగనానాం శోభా హరే రేణదృశోథయన్త్యా
చిరాపరాధ స్మృతి మాంసలోపి రోషః క్షణ ప్రాధుణికో బభూవ

క. బాల! నృపాలునికిం బ్రతి
కూలముగ మెలంగి భయముఁ గొంటిఁ, దెరువరిన్,

మేలెంచి నిలువఁ జోటిడి
పాలింపుము నన్ను వేగఁ బరమాదృతితోడా॥

శ్లో. రాజ్ఞో మత్ప్రతికూలా న్మే మహాన్భయ ముపస్థితః
బాలే హరయ పాన్థస్య వాస దానవిధానతః 21

గీ. విరహమున వికలాత్మ యాతరుణి యకట
నీరమమరని చోటివిసార మయ్యె
మలయశిశిరానిలంబును జ్వలనమయ్యె
మణిమయావాసమును మహావనము నయ్యె॥

శ్లో. మలయానిల మనలాయతి మణిభవనే కాననాయతి క్షణతః
విరహేణ వికలహృదయా నిర్జలమీనాయతే మహిలా॥ 22

క. కాలాగురుసారంబును హాలాహలమట్లు తలఁచు నత్యంతంబుగా,
నీలోత్పలమాలను దా వ్యాళావళియట్లు లెంచు, బాల విరహియై॥

శ్లో. కాలాగురుద్రవం సా హాలాహలవద్విజానతీ నితరామ్
అపి నీలోత్పలమాలాం బాలా వ్యాలావలిం కిలా మనుతే॥ 23

క. హరిణార్భకలోచన యాతరుణి తిలోత్తమకుఁ దుల్యతందాల్చి, మనో
హరియై సుఖముం గూర్చుట,నరజగమే నాకజగమునాకుంజూడన్

శ్లో. తయాతిలోత్తమాయన్త్యా మృగశాబక చక్షుషా
మమీయం మానుషో లోకో నాకలోక ఇవాభవత్॥ 24

## ప్రక్షిప్తములు

గీ. అలికసుందరి కస్తూరి తిలక మంక
మని తలంచి త్వదాస్యముఁ గని భ్రమించి
ముకుపుటములు చిరము చకోరకము లాసఁ
దెఱచి తెక్కలి నార్చు నిందీవరాక్షి !॥

శ్లో. అంకాయమాన మలికే మృగనాభిపఙ్కం
పఙ్కేరుహాక్షి వదనం తవ వీక్ష్య బిభ్రత్
ఉల్లాస పల్లవిత కోమల పక్షమూలంః
చఞ్చూపుటం చటులయన్తి చిరం చకోరాః॥ 25

క. కమలము శిశిరంబునఁ, జం
ద్రము మండల మహామునందు రాజింపని చం
దమునన్ రోషమునఁ బ్రకా
శముఁగనని త్వదాస్య మరసి సఖి! మదిఁ దలఁకుఁజా॥

శ్లో. శిశిరేణ యథా సరోరుహం దివసేనామృతరశ్మి మండలమ్
నమనాగపి తన్వి శోభతే తవరోషేణ తథేత మానసమ్॥ 26

క. పరుషాశని సమ చిత్తుఁడఁ,
దరుణియొ యమృతైకమూర్తి, తగ నిరుపుర కీ
వరుసఁజా మైత్రిం గూర్చుట
సరసిజసంభవుఁడు మిగుల జడుఁడని యెంతుఁజా॥

శ్లో. శతకోటి కఠిన చిత్తః సోహం తస్యాః సుధైకమయమూర్తేః
యేనాకాంక్షి మిత్రం సవికలహృదయో విధి ర్వాచ్యః॥ 27

క. శ్యామలమగు నంకము గల
నీమోమును గూర్కు తేఁటి నెలకొన్న లస
త్తామరసంబటు లెంచెద
నామది, నది మఱవుఁ బొరయునా? యెన్నటికిన్॥

శ్లో. శ్యామలేనాఙ్కితం బాలే భాలే కేనాపి లక్ష్మణా
ముఖం తవాంతరా సుప్త భృంగ ఫుల్లాంబుజాయతే॥ 28

క. హిమకిరణ! నీదుకాంతికి
సమమేఱ లేదంచుఁ దలఁచి స్వాంతంబున, మో
దమునందకు, ధరిణీవల
యము నెల్లఁ గనిన యాతఁ డరుదో జడుఁడా?

శ్లో. అద్వితీయం రుచాత్మానం మత్వా కిం చంద్ర హృష్యసి
భూమండల మిదం మూఢ కేనవా వినిభాళితమ్॥ 29

క. సురుచిరనీలపటాంచల
పరివృతమగు హరిణనయన వదనము, యమునా
నరి దతిగభీర నీరాంతరమునఁ బ్రతిబింబితాబ్జునకు సాటియగున్॥

శ్లో. నీలాంచలేన సంవృత మానన మాభాతి హరిణనయనాయాః
ప్రతిబిమ్బిత ఇవ యమునా గభీరనీరాంతరేణాంకః 30

గీ. పొలతి చెక్కిలడిగి స్తనాభోగమునకు
వ్రాలు కుటిలాలకంబులు, వనజవైరి

బింబమునుండి మేరునగంబుపైకి
ప్రేలు నురగంబటంచు భావింతు నెడఁద॥

శ్లో. స్తనాభోగే పతన్ భాతిక పోలా త్కుటిలోలకః
శశాంకబిమ్బతో మేరౌ లంబమాన ఇవోరగః॥ 31

గీ. ప్రసవగుచ్ఛభరంబున వంగుతీవ
గతిని జన్నులబ్రేఁగున నతవు నీవు
మఎవలీః నీకు సాటియ యదియు నిజము
కెంబెదవివంటి లేఁజిల్లవం బెసఁగుట॥

శ్లో. యథాలతాయాః స్తబకా నతాయాః స్తనావనమ్రే నితరాం సమాసి
తథా లతా పల్లవినీ సగర్వే శోణాధరాయాః సదృశీ తవాపి॥ 32

గీ అతిమనోహర మీసుమోద్యానవనము
నతలతాంత స్తబకములౌ లతలవలన
నిరతముఁ బ్రసేవ్యమగుఁ, గుచభరమెనంగు
యువతు లాత్మను హరియింప కుందురేని॥

శ్లో. ఇదం లతాభిః స్తబకా నతాభిః మనోహరం హన్త వనాన్తరాళమ్
సదైవ సేవ్యం స్తనభారవత్యో నచేద్యువత్యో హృదయం హరేయుః

గీ. తన్వి నారాకఁ గడుఁబ్రమోదము వహించి,
పుచ్చి తేయెల్లఁ గ్రీడలఁ, బ్రొద్దువొడువఁ
గూర్కుచో, ముఖగంధముఁ గ్రోలవచ్చు

తుమ్మెదలు లేపియుం బ్రబోధమ్ముఁ గనదు॥

శ్లో. సా మదాగమన బృంహితతోషా జాగరేణ గమితాఖిలదోషా
బోధితాపి బుబుధే మధుపై ర్న ప్రాతరాననజ సౌరభలుబ్ధైః 34

గీ. ప్రథితుఁడగు శంబరారి ప్రభావ గరిమఁ
బడసిన యచింత్యశక్తి, నీ వదన మిపుడు
గనియె విధుభావమును, గనుంగవయుఁ గంజ
దళ విశాలత నొందె సుందరి ! తలంప॥

శ్లో. అవిచింత్యశక్తివిభవేన సుస్దరి ప్రథితస్య శంబరరిపోః ప్రభావతః
విధుభావ మంచతితమాం తవాననం నయనే సరోజదళ నిర్విశేషతా।

క. వరదృష్టుల మీనవతియుఁ
గరచరణంబులఁ బ్రఫుల్లకమలవతియుఁ, బెణ
గురులఁ శైవలినియు, సుం
దరి, సురసయు సరస యగుఁగదా రసికులకుఁ

శ్లో. మీనవతీ నయనాభ్యాం కరచరణాభ్యాం ప్రఫుల్లకమలవతీ
శైవలినిచ కేశైః సురసేయం సుస్దరీ సరసీ॥ 36

క. మందమతీ! పాంథుఁడ, మనమందున నెనలేని తాపమంచఁగ నేలా?
పొందుగఁ బయోధరము నీ
వెందేఁ గనుగొనుము శాంతియెసఁగును దానఁ॥

## ప్రక్షిప్తములు

శ్లో. పాంథ, మందమతీ, కింవా సన్తాప మనువిన్దసి
పయోధరం సమాశాస్య యేన శాన్తి మవాప్నుయాః    37

క. అతిమాత్రతన్వి యగు నీ
యతివ జగంబెల్ల నింప నాత్మద్యుతితో
మతి, నది సౌదామినియో,
సితనిశయో, యనుచు శంకఁ జెందిరి జనముల్॥

శ్లో. సంపద్యతాం తా మతిమాత్ర తన్వీం శోభాభి రాభాసిత సర్వలోకామ్
సౌదామినీ వాసిత యామినీవేత్యేవం జనానాంహృది సంశయోభూత్

గీ. సతి లసత్పాణిపదములు స్మితముఖంబు
సరసి కిసలములతోడి వల్లరియొ. కాక,
ఫుల్లజలజాతమైన యంబుజమొ యనుచు
జనములెల్లరు మదిని సంశయముఁ గనిరి॥

శ్లో. సపల్లవా కింను విభాతి వల్లరీ సపుల్ల పద్మా కిమియంను పద్మినీ
సముల్లసత్పాణిపదం స్మితాననాం ఇతీక్షమాణాం సమభూత్సంశయః

క. తరుణకుఁ గనుంగవ యందము
గల కలికిమొగంబుఁ గాంచి, కమలమొ, కాదే
జలజారి బింబమో యని
తలఁచిరి తత్క్షణమ జనులు దమస్వాంతములన్

శ్లో. నేత్రాభిరామం తామాయా వదనం వీక్ష్య తత్క్షణమ్
సరోజం చంద్ర బిమ్బం వేత్యఖిలాః సమశేరత॥    40

గీ. పసిఁడి వన్నియ మైజిగి యెసఁగు సతిని
గలిసి రాముండు వనమున మెలఁగుచుండ,
మించుతోనున్న మొయిలనియెంచి, యలరి,
చాతకమ్ములు నృత్యమ్ము సలుపఁదొడఁగె॥

శ్లో. కనకద్రవ కాన్తి కాన్తయా మిలితం రామ ముదీక్ష్య కాన్తయా
చపలాయుత వారిదభ్రమాన్ననృతే చాతకపోతకైర్వనే॥ 41

క. లోకము సర్వము 'వనిత'గ
వాకొను నీతరుణి, నల్లె వాకొనుఁగాత్రా
నాకో, యువకులొనర్చు ననేకతపఃఫలముగాఁగ నెదఁదం దోఁచెఁ

శ్లో. వనితేతి వదన్త్యేతాం లోకాస్సర్వే వదన్తుతే
యూనాం పరిణతా సేయం తపస్యేతి మతం మమ॥ 42

క. తరుణీ వికసిత వదనముఁ బరికించి చకోరతతులు భ్రమరావలులా
పరమ ప్రమోద పరతఁగ గరము విజృంభించె జనులకనులకు విందై

శ్లో. స్మయమానాననం తత్ర తాం విలోక్య విలాసినీ
చకోరా శ్చంచరీకాశ్చ ముదం పరతరాం యయుః 43

క. బాలామణి! సుస్మిత సుష
మాలేశము నీదు ముఖకమలమున మిపులగా
గ్రాలు నెపు, డపుడ మదనుఁడు
లీలఁగ జగమెల్ల గెలువలేఁడె? దృఢముగఁగా॥

# ప్రక్షిప్తములు

. వదన కమలేన బాలే స్మితసుషమా లేశ మాదధాసి యదా
జగదిహ తథైవ జానే దశార్ధబాణేన విజితమితి ॥ 44

గీ. యమున నీటిభరాన నర్ధము మునింగి
బిట్టుగాఁ గూయు కొంగలు, నిట్టలమగు
నిరులతోఁ బోరి బయటికి నరుగుదెంచు
కలువతేని కిశోరముల్గాఁగఁ దలతు॥

శ్లో. కలిందజా నీరభరేర్ధమగ్నా బకాః ప్రకామం కృతభూరిశబ్దాః
ధ్వాన్తేన వైరా ద్వినిగీర్యమాణాః క్రోశన్తి మన్యే శశినః కిశోరాః

గీ. నతములగు కనుబొమల యందమున వెలయు
సకియ చనులు పరస్పరసంగవశతఁ
జటుతరములయ్యెఁ, దర్పారవహనశక్తి
చాలమింజేసి కౌఁదీవ సన్నగిల్లె॥

శ్లో. పరస్పరాసంగ ముఖా న్నతభ్రువః
పయోధరౌ పీనతరౌ బభూవతుః
తయో రమృష్యన్నయ మున్నతింపరా
మవైమి మధ్యస్తని మానమేతి॥ 46

గీ. తరుణి చికురాకృతిని గొప్పయిరులు బలిసి
జనులకుం భ్రమఁగొల్పెడునని తలంతుఁ
గాని, కాంతులగురియు నీయాననేందు

రుచులు పర్వఁగ నది చాలఁ బ్రచురమయ్యె॥

శ్లో. జనమోహకరం తవాలి మన్యే చికురాకార మిదం ఘనాన్ధకారమ్
వదనేన్దు రుచా మిహ ప్రచారా దివ తన్వంగి నితాన్త కాన్తి మన్తమ్

గీ. సరసిజాక్షి కుచంబుల సామ్య మొందఁ
దలఁచి రాత్రిందివమ్ము లీతమ్మిచాలు
నీటఁ గుత్తుకబంటి మునింగి నిలిచి.
తపనుఁగూరిచి దీక్షమైఁ దపమొనర్చు

శ్లో. దివానిశం వారిణి కంఠదఘ్నే
దివాకరారాధన మాచరన్తి
వక్షోజతాయై కిము పక్ష్మలాక్ష్యా
తపశ్చరం త్యమ్బుజ పఙ్క్తిరేషా॥ 48

గీ. సకి! వియోగిని! నీము త్తైసరము, నీదు
దయితు సంగమసుఖము నొందఁగఁ దలంచి
యందువిరహాగ్ని సంభృత కుండమగుచు
దనరు నీయెదపయి నిదె తపమొనర్చు॥

శ్లో. వియోగవహ్ని కుండోస్మిన్ హృదయేతే వియోగిని
ప్రియసంగ సుఖాయేవ ముక్తాహార స్తపస్యతి॥ 49

గీ. అమిత లావణ్యనిధిగఁ ద్వదాననంబుఁ
జేసి, సరసిజుఁడే భ్రమఁజెందె ననుచుఁ

దలఁతు. గాకున్న నిపుణుఁడౌ, నతఁడు విధుని
నలుపునె కళావిహీను వికలుని రాజు,

శ్లో॥ నిధిం లావణ్యానాం తవ ఖలు ముఖం నిర్మితవతో
మహామోహం మన్యే సరసిరుహసూనో రుపచితమ్
ఉపేక్ష్య త్వాం యస్మా ద్విధుమయ మకస్మా దిహ కృతీ
కలాహీనం దీనం వికలమివ రాజాన మకరోత్॥ 50

గీ॥ కలికి నీహృదయానురాగంబు దివ్య
మైన మాణిక్యరూపము నూని ప్రియుని
నరయు కోర్కిని బయటికి నరుగుదెంచి
చనుఁగవకు మధ్యమున నిల్చెనని గణింతు॥

శ్లో॥ స్తనా న్తర్గత మాణిక్య వపుర్బహి రుపాగతమ్
మనోనురాగి తే తన్వి మన్యేవల్లభ మీక్షితుమ్॥ 51

క॥ సారంగకిశోరాక్షీ
చారు ముఖవ్యాజమున నిశాపతి యమృతా
సార మయాత్మాంశువులను
బూరించుచు జగతినిదిగో పొడమెను బెలుచన్

శ్లో॥ జగదంతర మమృతమయైరంశుభి రాపూరయ న్నితరామ్
ఉదయతి వదనవ్యాజాత్ కిము రాజా హరిణశాబనయనాయాః॥ 52

గీ. తిమిరమును శరదిందు కాంతియుఁ బ్రఫుల్ల
వారిజము పగడాలు సంపంగెమొగడ
యొక్కెడం గూడియున్నచో నొక్కవేళ
నెనయగునొ యేమొ తరుణిమోమునకుఁ గొంత॥

శ్లో. తిమిర శారద చందిర చంద్రికాః కమల విద్రుమ చమ్పక కోరకాః॥
యది మిలంతి కదాపి తదాననం ఖలు తదా కలయా తులయామహేః

గీ. ప్రియ! విషాదము విడు'మని ప్రియుఁడు పన్నుఁ
జేరి యనురాగమునఁ బల్క వారిజాక్షి
కన్నుఁగపనుండి బహుళాశ్రుకణము లురలె
నంత నభిమాన మెదనుండి యంతరించె॥

శ్లో. ప్రియే విషాదం జహిహీతి వాచం ప్రియే సరాగం వదతి ప్రియాయాః
వారా ముదారా విజగాలధారా విలోచనాభ్యాం మనసశ్చ మానః॥ 54

క. అమృతకరుండగు రాజా
నుమశరు రాజ్యాభిషేక శుభవార్తను లో
కమునకుఁ దెలుపుటకో, యన
నమలసుధావృష్టి నవనినంతయు ముంచెన్

శ్లో. రాజ్ఞాభిషేక మాజ్ఞాయ శంబరాసుర వైరిణః
సుధాభి ర్జగతీ మధ్యం లింపతీవ సుధాకరః॥ 55

## ప్రక్షిప్తములు

క. లోలాలకా వృతంబగు బాలకురంగాక్షి మోము పరికించి, చల
త్కేళీలాలస మధుకరపాళీ భరితాబ్జమనుచు భావింతుమదిన్॥

శ్లో. ఆననం మృగశావాక్ష్యా వీక్ష్య లోలాలకావృతమ్
భ్రమద్భ్రమర సంభారం స్మరామి సరసీరుహం 56

క. స్మయమానాస్యాంబుజ యగు ప్రియురాల్ గురుజనులతోడ వెడలుచు, గళమా
ర్చను వెనుక ద్రిప్పికను నెంతయు నిష్పత్రముగ జగతిం దాం జేయు గతిన్ ॥

శ్లో. యాన్తీ గురజనైస్సాకం స్మయమానాననాంబుజా
తిర్యగ్గ్రీవం యదద్రాక్షీత్ తన్నిష్పత్రా కరో జ్జగత్ 57

క. కిరణమ్ముల గిలిగింతల విరియని నీరజిని నినుండు వికసిలంజేయుం
బరపూనురాగమునందా నరయ న్వేకువనే,యతనికగు జయ మెపుడున్

శ్లో. విబోధయన్ కరస్పర్శైః పద్మినీం ముద్రితాననామ్
పరిపూర్ణానురాగేణ ప్రాతర్జయతి భాస్కరః 58

గీ. శిరమెుకించక వంచు నత్తరుణి మధుర
వచనముల నిల్పనేంగ్రుధ ప్రకటపఱచి
వెడలంబూన విదేశముం బ్రేలిం బట్టి
యాడు లేంబల్లి విడి దారి నడ్డగించెః

శ్లో. అనమ్య వల్గువచనైః వినివారితేపి
రోషాత్ప్రయాతు ముదితే మయి దూరదేశమ్

శాలా కరాఙ్గుళి నివేశ వశంవదేన
క్రీడా బిడాల శిశునాశు రురోధ మార్గమ్॥ 59

గీ. ఎల్లెడను సుధ నీమోము చల్లుచుండ
నతను కోదండమహిమకు నష్టమున్నె ?
కనులతాపంబుతో నిరు లణఁగిపోవె ?
యిందుఁ డనుదిన ముదయింప నేల యింత ?

శ్లో. అభూ దప్రత్యూహః కుసుమశర కోదణ్డ మహిమా
విలీనో లోకానాం సహ నయనతాపోపి తిమిరైః
తవాస్మిన్ పీయూషం కిరతి పరిత స్తన్వి వదనే
కుతో హేతో శ్చేతో విధురయ ముదేతి ప్రతిదినమ్॥ 60

గీ. శస్త్రముల్లేకయ వివేకశాలురైన
యువుల హృదయాలు చీలుచు నుద్యమమున
దశముల్ గద నీలాబ్జదళ విశాల
లోచనల హారి మాయా విలోలకృతులు॥

శ్లో. వినైవ శస్త్రం హృదయాని యూనాం
వివేకభాజా మపి వారయన్త్యః
అనల్ప మాయామయ వల్గులీలా జయంతి నీలాబ్జ దళాయతాక్ష్యః 61

గీ. మందపవనంబునం, దూండ్ల, మలయజముల,
నలదముల, శైవలంబుల జలజములయుఁ

జల్లఁదనము వినా, తెల్వి నుల్లసిలిరి
ప్రియుల నెడఁబాసి మదిని దపించు సతులు॥

శ్లో. మృణాల మందానిల చందనానా ముశీర శైవాల కుశేశయానామ్
వియోగ దూరీకృత చేతనానాం వినైవ శైత్యం భవతి ప్రతీతిః॥ 62

క. ఎందనుక నిందువదనల సుందరయౌవనము వెలుఁగు సువిలాసలస
న్మందిరమయి యువహృదయము
లందనుకఁగా వహ్నిలేకయ దహింపఁబడుఁగా॥

శ్లో. యదవధి విలాసభవనం యౌవన ముదియాయ చంద్రవదనాయాః
దహనం వినైవ తదవధి యూనాం హృదయాని దహ్యన్తే॥ 63

గీ. తనయెడఁగా శిథిలంబైన దయితుప్రేమఁ
బడయ, సతనికిఁ దెలిపె సపత్నికతల
"నామెచూపులు నీచూపులు లైక్యమందు;
నగుచు బల్కుఁడు; నీవర్తనలతుఁ గనలు॥

శ్లో. న మిశ్రయతి లోచనే సహసితం నసంభాషతే
కథా సు తవ కించ సా విరచయ త్యరాళాం భ్రువం
విపక్ష సుదృశః కథామితి నివేదయంత్యా పురః
ప్రియస్య శిథిలీకృతః స్వవిషయే నురాగగ్రహః 64

క. బడబానల హాలహాలముల
వడువున, మకరములతోడ వ్యాళంబులతోఁగా

జడధిం బెరిగిన చంద్రుఁడు
పుడమి నరుల ప్రాణములను బొలియింపఁ డెటుల్॥

శ్లో. బడబానల కాలకూటవర్గ మకరవ్యాళగణై స్సహైధితః
రజనీరమణో భవేన్నృణాం స కథం ప్రాణవియోగ కారణమ్ 65

క. పుణ్యవశంబున సాధ్వీగణ్య గృహిణి గలుగు,నామె గనుఁ బావనసా
ద్గుణ్యుల సుతులఁగా, వారల
గణ్య యశముఁ గూర్తు౹, దానఁ గను నరుఁడు దివిన్

శ్లో. లభ్యేత పుణ్యై ర్గృహిణీ మనోజ్ఞా
తయా సుపుత్రాః పరితః పవిత్రాః
స్ఫీతం యశస్తైః సముదేతి నిత్యం తే నాస్యనిత్యః ఖలు నాకలోకః

క. వామోరూ! నీయధరముఁ గామించిన నాదుకోర్కెఁ గడతేర్చితివే?
భూమీశుఁడైనఁ బరునిం గామించిన, దేనికేనిఁ గను లాఘవమున్

శ్లో. ప్రభురపి యాచితుకామో భజతే వామోరు లాఘవం సహసా
యదహం త్వయాధరార్థీ సపది విముఖ్యా నిరాశతాం నీతః॥ 67

క. కొలనికడనుండి వేగమ జలకుంభముఁ దలనుదాల్చి చనుదెంచెడి నీ
వల తటపుఁదోఁపుమఱుగున
సలిపినరతి యెఱుఁగుఁ బంచశరదైవంబే॥

శ్లో. జలకుంభ ముమ్భితరసం సపది సరస్యాః సమానయంత్యా స్తే
తటకుఞ్జ గూఢసురతం భగవా నేకో మనోభవో వేద। 68

# ప్రక్షిప్తములు

క. నీవలె నావల్లభుఁ డెంతే విటపితతిఁ గ్లేశంబు పిట్యాన్నముఁ గాంతా
యేవిధి నితరములిఁక నాజీవితమున కింతకంటె శ్రేయముగూర్చున్

శ్లో. త్వమివ పథిక ప్రియో మే విటపిస్తోమేషు గమయతి క్లేశాన్
కిమితోన్యత్కుశలం మే సమ్ప్రతియ త్పాంథ జీవామి॥ 69

క. గౌరాంగి! నీకుఁ దుల యె
వ్వారలు లేరంచు గర్వపడకుము యెప్పుడుం
గారవపుల నెన్నియొ ఫల
భార నతములయిన బాల పల్లరు లెసఁగున్॥

శ్లో. తులా మనాలోక్య నిజా ముఖస్వం గౌరాంగి గర్వం నకదాపికుర్యాః
లసంతి నానాఫల భారవత్యో లతాః కియన్త్యో గహనాన్తరేషు॥ 70

క. తోయముల నిలిచి, కమలము
సాయము వఱ కినునిఁ గూర్చి సలుపుం దపముం
బాయనిభక్తిని గానీ
నీయాననసమము మానినీ! వడయదుగా॥

శ్లో. ఆసాయం సలిలాంతః సవితార ముపాస్య సాదరం తపసా
అధునాప్యైన మనాక్ తవ మానిని తులనా ముఖస్యాపి॥ 72

క. సుందరి నీయందపు మొగ
మందునఁ జిఱునగ వొకింత యలరినమాత్రఁ

* ఇందుని సామ్రాజ్యం బడఁ
గుం. దోడ్తో. నిజము సుమ్మ! కోమలగాత్రీ!

శ్లో. అయి మందస్మిత మధురం వదనం తన్వంగి యది మనాక్ కురుషే
అధునైవ కలయ శమితం రాకా రమణస్య హంత సామ్రాజ్యమ్ 37

గీ. మధుర మధుమదమత్తుఁడు మాటిమాటి
కలరి బిగ్గఱగా నవ్వ, నాత్మ యంద
గొఱఁగునేదియొ, యెఱ్ఱిదనుచుఁ దలఁచు
ముజ్జగంబులఁ, గను శూన్యములనె యెప్పుడు॥

శ్లో. మధురతరం స్మయమానః స్వస్మిన్నేవాలపం చ్ఛనైః కిమపి
కోకనదయం త్రిలోకీ మాలమ్బనశూన్య మీక్షతే క్షీబః॥ 73

క. తరుణీ! మధురసమధుర, మ
ధరమును నావదనసీమఁ దార్కొననిమ్మా!
ధరపయిఁ బడకుండఁగ, నా
కరమును నీకరమునం దగం గైకొనుమా!

శ్లో. మధురసా న్మధురం హి తవాధరం తరుణి, మద్వదనే వినివేశయ
మమ గృహాణ కరేణ కరామ్బుజం పపత మిహహా భభభూతలే॥

చ. అతనము లెంతయు న్పలిపి సౌధముమీఁదికిఁ జేరి, చంద్రికా
తతిఁ గడువెల్లనైన సుమతల్పమునన్ శయనించియున్న రా

* డిందును రాకేందుని రా
జ్యేందిరయున్ నిజము వెంటనే తరలాక్షీ!

ట్పతిఁ, జకితేక్షణఁ, దరహాసన్ముఖి, సల్లలితాంగి, నక్కౌనం
దతిముదమూర సూర్పు లౌలయం గవుగింటఁ గృతార్థుఁడౌత్రైడుఁ

శ్లో. శతేనోపాయానం కథమపి గతః సౌధశిఖరం
సుధాఫేన స్వచ్ఛే రహసి శయితాం పుష్పశయనే
విబోధ్య క్షామాజ్గీం చకితనయనాం స్మేరవదనాం
సనిఃశ్వాసం శ్లిష్య త్యహహ సుకృతీ రాజరమణీమ్॥ 75

క. జలదం బుదయింపఁగఁ గ
జ్జల మలినంబయ్యె నాకసము పాంథజనం
బుల మది రక్తిమ దోఁచెఁ
దెలుపెక్కె మృగీదృశాతతికిఁ జెక్కౌలఁ

శ్లో. ప్రాతుర్భవతి పయోధే కజ్జల మలినం బభూవ నభః
రక్తంచ పథికహృదయం కపోలపాలీ మృగదృశః పాణ్డు 76



## కరుణ సముల్లాసము

గీ. అకట! సీతను బాసితి హతుఁడ నైతి,
సింహముఖి నవ్వనా వని నెట్లు బ్రదుకు?
సుకృతు లేమంద్రు నేవారిఁ జూతు నెట్లు
రాజ్యము రసాస్థలి జనని! బ్రదుకు చెదని! 1

## శాంత సముల్లాసము

శ్లో. పాపం హన్త మయాహతేన విహితం సీతాపియద్యాపితా
మా మా మిన్దుముఖీ వినా బత వనే కిం జీవితం ధాస్యతి
ఆలోకేయ కథం ముఖం సుకృతినాం కిం తే వదిష్యన్తి మాం
రాజ్యం యాతు రసాతలం పునరిదం న ప్రాణితుం కామయే॥



## శాంత సముల్లాసము

గీ. చంద్రికామయనవసుధల జగతి సమితిఁ
జల్లి జనుల తాపత్రయము మెల్లఁ దొలఁచు
నతనిఖిలదేవసృతుఁడు బృందావనగతుఁ
డడఁచు నవవారిధరుఁడు నాయాత్మతమము॥

శ్లో. జగజ్జాలం జ్యోత్స్నామయనవసుధాభిర్జటిలయ
ఞ్జనానాం సంతాపం త్రివిధమపి సద్యః ప్రశమయఞ్
శ్రితో వృన్దారణ్యం నతనిఖిల బృన్దారకవృతో
మమ స్వాన్తధ్వాన్తం తిరయతు నవీనో జలధరః॥ 1

గీ. గ్రీష్మచండాంశు మండల భీష్మశిఖకు
నుద్దియగు సంసృతిం దాపమొందు నాదు
బాధ వృష్ణివరేణ్యుఁడు ప్రావృషేణ్య
వారిధరమట్లు వేగమ మాపుఁగాక।

శ్లో. గ్రీష్మచణ్డకరమణ్డల భీష్మ జ్వాలసంసరణ తాపితమూర్తేః
ప్రావృషేణ్య ఇవ వారిధరో మే వేదనాంహరతు వృష్ణివరేణ్యః॥2

## శాంత సముల్లాసము

గీ. వి_స్తృతాపార సంసృతి విషమవిషయ
గహనసరణి విరామము గనక, తిరిగి
తిరిగి, నాజడమతి, శ్రమదీఱ, యమున
దరిఁగల తమాలముం జేరెఁ దన్పుఁ గనుత ।

శ్లో. అపారే సంసారే విషమ విషయారణ్య సరణౌ
మమభ్రామం భ్రామం విగలిత విరామం జడమతే
పరిశ్రా_న్త స్యాయం తరణితనయాతీరనిలయః
సమన్తాత్సంతాపం హరినవతమాల స్థిరయతు॥

గీ. ప్రేంకణపుఁదీగెను దమాలవృక్షమట్లు
సింధుకన్యక కౌగింటఁ జెలఁగు విధుఁడు
జలజనాభుఁడు దేహావసానవేళ
వెలుఁగుఁగావుత । నామనోవీధియందు,

శ్లో. ఆలిఙ్గితో జలధి కన్యకయా సలీలం
లగ్నః ప్రియంగులతయేవ తరు_స్తమాలః
దేహావసానసమయే హృదయే మదీయే
దేవశ్చకాస్తు భగవా నరవిన్దనాభః॥ 4

క. అందముగ దృగానందపు సందోహముతుందిలమ్ము సలుప క్షమంబౌ
చుందనరెడు కాదంబిని ప్రమందించెదుఁగాక నాదురంతపు బాధః

శ్లో. నయనానన్దసందోహ తున్దిలీకరణ క్షమా ।
తిరయత్వాశు సంతాపం కాపి కాదమ్బనీ మమ। ౮

# ప్రక్షిప్తములు

గీ. వారయోషిదజామిళ ప్రముఖులైన వారిఁ గాచిన నీవు సంసారమనెడి
పెనునెడారిని గర్తాన వేదనపడు నను, నుపేక్షింపకుము. కరుణాస్వరూప

శ్లో. గణికాజామిళ ముఖ్యానవతా భవతా బతాహమపి
సీదన్ భవమరుగర్తే కరుణామూర్తే న సర్వథోపేక్ష్యః

క. మలయానిల హాలాహల
ముల, రమణీ కుంతలాహి భోగములందున్
అల శ్వపచ కుసుమశరులం.
గలుగుతఁ బరమాత్మమతి, నికామము నాకున్ ॥

శ్లో. మలయానిల కాలకూటయోః రమణీ కుంతలభోగి భోగయోః
శ్వపచాత్మభువో నిరంతరా మమభూయాత్పరమాత్మని స్థితిః॥ 6

క. భువనంబెల్లనునశ్వరమవు నింకఁ గళేబరమ్ము నడుగఁగవలెనే ?
భువినద్దానికినయి జనులవురాఃపాట్లెన్నొ పడఁగ నగునే ?తలఁపన్

శ్లో. నిఖిలం జగదేవనశ్వరం పునరస్మిన్నితరాం కలేవరమ్
అథతస్య కృతే కియానయం క్రియతేహన్త జనైః పరిశ్రమం 7

చ. అనుపదమెల్ల లోకము లనర్గళమృత్యుముఖమ్ముఁ జొచ్చుటల్
గనియు, మదింగటా ! విషయ కాంక్ష దొలంగ దణంగుఁగాక యీ
ఘనతరరాజ్యలక్ష్మి, పడుఁగాక కృపాణపుటంచుఁ బైని, పె
ల్చనఁ గొనుఁగాక, కాలుఁడు తలన్, విడఁబోదు మదాత్మ ధర్మమున్

శ్లో. అనుపద మఖిలాన్లోకాన్ మృత్యుముఖం ప్రవిశతో నిరీక్ష్యాపి
హా, హన్త కిమితి చిత్తం విరమతి నాద్యాపి విషయేభ్యః

## శాంత సముల్లాసము

సపది విలయమేతు రాజలక్ష్మీ రుపరిపత న్త్వ థవా కృపాణధారాః
అపహరతు తరాంశిరః కృతాన్తో మమతు మతిర్నమనాగపైతుధర్మాత్ ॥

క. అనయము పగతురు నాపల
ననలత తి న్నింత్రుగాక ! యతిమాత్రముగన్
సునిశిత కృపాణధారా
వినిపాతము చెందుగాత, విడధర్మంబున్

అపి బహలదహన జాలం మూర్ధ్ని రిపుర్మే నిరంతరం ధమతు।
పాతయతు వాసిధారా మహమణు మాత్రం కించిదపిభాషే।

---

ప్రముదిత చిత్తవృత్తి నిదె పండితరాయల భామినీవిలా
సముఁ దెలిఁగించి, త్వచ్చరణ సారసయుగ్మ సమీపమందు, స
త్యమరినభక్తిఁ గానుకఁగ, సమర్పణముం బొనరించితి, న్నితాం
తముఁగరుణాసుధారసము దళ్కొనలారఁగఁ గొమ్ము శ్రీపతీ॥

---

భామినీవిలాసము సర్వంబును సమాప్తము
శ్రీ వేంకటేశ్వరార్పణమస్తు



# పండితరాయల పరిణయము



'భామినీవిలా'సానువాదము సమాప్త మయినది. ఈసందర్భమున నే తత్కావ్యమున కా పేరెట్లు వచ్చినదో, యది యెంతవఱకు సముచితమో చర్చించుట అవసరము.

పండిత రాయలు తాను రచియించిన గ్రంథములకు ఆభరణ, లహరి, విలాస పదములను ఉటంకించుచు వచ్చినాఁడు. జగదాభరణము, ప్రాణాభరణము, గంగాలహరి, పీయూషలహరి, అమృతలహరి, అసఫ్ విలాసము మున్నగునవి ఇందులకు నిదర్శనములు.

విలాసశబ్దపు ఉటంకింపువలన భామినీవిలాసముతో సాదృశ్య నామముగల అసఫ్ విలాసము పండితరాయల ఏలికనుగుఱించినదియు నొకటి గలదు. ఐన నిఁక భామినీవిలాస మెట్టిది ? ఇందు ప్రస్తావితమైన భామిని యెవరు ?

ఈ సందర్భమున సారస్వత చరిత్రకారులలో భేదాభిప్రాయములు కవు కొందఱు :—'ప్రాపంచి కానందములలో నెల్ల నుత్కృష్టమగు ప్రణయానుభూతి వలని సుఖమును మానవుఁడు తరుణీ సంపర్కము వలననే కాంచుటచేఁ, బండితులగు వారట్టి ప్రేమ చర్యల కాధారములగు విషయముల నభివర్ణించి ప్రకృష్టరసోపానకు లగుదురు. అట్టి శృంగారకవితా రసస్రవంతి తప్పక పాఠకుల హృదయకేదారములఁ బ్రవహించి భావసూనములపంటఁ బండించును. ఈ కావ్యమాకార్యమున నిరుపమాన మగుటఁ దీనికి 'భామినీవిలాస'—మను నామమెంతేని సార్థక మయినది'—అని యభిప్రాయ పడుచున్నారు.

కొందఱిందలి శ్లోకములలో నెక్కువ సంఖ్యకలవి 'భామిని'కి సంబం ధించినందున నీపేరు గలిగెనందురు. ప్రొఫెసరు తారానాథులు పండిత రాయల భార్య పేరే దీనికిఁ బెట్టఁబడె ననుచున్నారు.

ఐన పండితరాయల భార్యపేరు 'భామిని' యైయుండవలయును కదా! అట్లనుటకు గ్రంథస్థ గ్రంథాంతర నిదర్శనము లేమియు కానరావనవలసి యున్నది.

పండితరాయల పరిణయమును గుఱించియు, అతని భార్యానామ మును గుఱించియు అనేకవిధముల గాథలు పండితలోకమున వ్యాపించి యున్నవి. వానిని పరామర్శింతము.

శ్రీ జగన్నాథ పండితరాయలు క్రీ. శ. 1600—1660 సం॥ ముల మధ్య జీవించియుండెనని కొందఱును, 1620—1675 సం॥ముల మధ్య వెలసియుండెనని కొందఱును జెప్పుచు. అతఁడు తనపదునైదేండ్ల ప్రాయ మునకు లోపుననే కాశికి వెడలి ముప్పదియేండ్ల వయస్సు వచ్చుసరికి విద్యా భ్యాసము పూర్తి గావించుకొని, ఢిల్లీపాదుషా కొలువునఁజేరెనను విషయ మున మాత్రము చరిత్రకారులెల్ల రేకాభిప్రాయమును వెల్లడించు చున్నారు.

అతని వివాహముంగూర్చియు. నతని గృహిణ్యభిధానముం గూర్చియు వారిలో నిట్టి ఏకాభిప్రాయము పొడగట్టుటలేదు.

కొందఱతఁడు'లవంగి'యను నక్బరు చక్రవర్తి దుహితను వరించె ననియు, మఱికొంద ఱాతఁడొకానొక సామాన్య యవనకన్యనే పెండ్లాడె ననియు, నింకకొంద ఱాతఁడెవ్వతెనో మహమ్మదీయకాంతనుంపుడు కత్తెగ నుంచుకొనెననియు, వేఱుకొంద ఱతఁడు సవర్ణవధువునే పరిణయ మయ్యెననియు నుడువుచున్నారు.

తండ్రికడ విద్యాభ్యాసము పూర్తికాఁగానే, జగన్నాథుఁ డొంటరిగఁ గాశికేఁగి యుండవలయును. అతనికి రామచంద్రభట్టను తమ్ముఁ డొకఁ డుండినట్లు నిదర్శనము గలదు. ఆతఁడు తెనాలి [illegible] న్నగ్రహారముగఁ బడసిన దఁట. జగన్నాథుఁడు కాశికి బయలుదేఱు నాఁటి కతఁడు గడుచిన్నవాఁడయి యుండును. అతని [illegible] జననీ జనకులు స్వగ్రామముననే యుండవలసి వచ్చియుండును. కాన వారు జగన్నాథునితోఁ గూడఁ గాశి కరిగియుండరు. [illegible] (అతనికి వివాహమయి యున్నచో) బహుశా బాలయయుండును. శ్రమలకు లోనైన యుత్తరదేశ ప్రయాణమున కాతఁడు ముక్కుపచ్చలారని యాబాలభార్యను దోడ్కొనిపోయి యుండుననుట యసంబద్ధము. కాన, ఢిల్లి చేరిన జగన్నాథున కప్పటి కవివాహమయి యుండవచ్చుననుటయే యుక్తము.

ఢిల్లీచేరిన పండితరాయలు ప్రసంగవశమునఁ [illegible] చెప్పిన యీ క్రింది చాటువుకూడఁ బై విషయమున కుపబలకముగ నున్నది.

శ్లో. శీతార్తా ఇవ సంకుచంతి దివసా న్నైనాస్త్వరం శర్వరీ
శీఘ్రం ముఞ్చతి కిఞ్చ సోపి హుతభుక్కోణం గతో భాస్కరః
త్వం చానఙ్గహుతాశభాజి హృదయే సీమన్తినీనాం గతో
నాస్మాకం వసనం న వాయుపతయః సంత్రప్రజామో వయమ్॥

ఇందలి 'వసనం'—'వాయుపతయః'—అను శబ్దముల వచనభేదముల నాధారమొనర్చికొని, శ్రీ అచ్యుతరాయ మోదక్కగారును, శ్రీ శివరాం మహాదేవ పరాంజపైగారును ఢిల్లీ చేరునాఁటికి జగన్నాథుఁ డవివాహితుఁ డనియే తీర్మానించిరి. ఇఁక నొకచో నేకవచనము, మఱియొకచో బహువచనముం బ్రయోగించుటచే, నతనిని 'దిగంబరు'నిగను, భార్యయేని (సవర్ణయో, అవర్ణయో)—లేనివానిగను భావించుట అసంబద్ధమనియు - శబ్దార

విచారమునకుఁ బ్రాధాన్యమిచ్చి, లేనిపోని కుశంకలతోఁ గూడిన స్తనశల్య పరీక్షగా విమర్శకుఁ దొడఁగిరి. కాని, ప్రకరణానుగుణ భావముం గ్రహింపరైరి. 'పనసం'-అను శ్లోకశబ్దమునకుఁ 'గప్పుకొనుబట్ట'—యని కాని, 'కట్టుగుడ్డ'—యని యర్థముగాదు. ఇఁక 'యువతయః'—యనుట, పైపాదములో 'సీమంతినీనాం'-అను శబ్దప్రక్రమముం దాటించుట యగును. ఇందు విపరీత మేమియులేదు.

విమర్శకాగ్రణులగు శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారును శ్రీ కావలి వేంకటరామస్వామిగారును, శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారును—'ఢిల్లీకిఁ జేరిన జగన్నాథుఁ డవివాహితుఁడే'యనియు, అట నొక యవనకాంతను ధర్మపత్నిగ స్వీకరించె'ననియు సహేతుకముగఁ జర్చించి యున్నారు. కాని, 'పండితరాయల చరిత్ర' వ్రాసిన శ్రీ భమిడి సత్యనారాయణగారు తద్వ్యతిరేకముగ, సవర్ణకన్యనే యతఁడు చేపట్టెనని నిరూపింపఁ, దలఁపుఁదగని యూహలతో—అభూత కల్పనలతో విశ్వప్రయత్న మొనర్చిరి. అవి సోపపత్తికములు గాకుంట హేతువాదమునకు నిలువవు.

పండితరాయ లవివాహితుఁడుగనే ఢిల్లి చేరెననియు, సవర్ణజాత నతఁడు పెండ్లాడు నవకాశము లభించలేదనియుఁ దెలుపుటకుఁ దగిన కారణములు కొన్ని కలవు.

(1) వారణాసికిఁ బండితరాయలతోఁ గూడ, నతని భార్యగాని, తక్కిన యాత్మీయులు గాని వచ్చిన సూచనలు లేవు.

(2) ఆట్లే యగుచో, నతని విద్యాభ్యాసమునకు, దేశసంచారమునకు' నానారాజాస్థానసందర్శమునకుఁ దగినంత తీరుబడి యతని కుండి యుండదు.

(3) అతఁడు తన వారిం జూచుటకుఁ గాని: వివాహము చేసికొనుటకు గాని ఢిల్లి నుండి స్వదేశమున కొకపరియేని పోయినజాడ గనిపించదు.

(4) అట్లు పోయియున్నచో, నతని ప్రఖ్యాతి నాలించిన దక్షిణాపథ మందలి రాజులాతనిఁ దమయాస్థానముల కాహ్వానించి యుందురు. అతఁడును పాండిత్య ప్రకాశము చేయకుండి యుండడు.

(5) ఆ కాలపు దూరప్రయాణములలోని సాధకబాధకము లనుభవించిన యాతఁడట్లూరుచేరి గార్హస్థ్యము నవలంబించి యుండునేని, సమీప రాజాస్థానములలోఁగాలక్షేపము చేసియుండును, కాని సకళత్రముగ మరల ఢిల్లికి వచ్చియుండుట అసంభవము.

(6) రసపుత్రి మహారాష్ట్రిలొకవంక మహమ్మదీయులొకవంకఁ గలహములతో గందరగోళపడు దేశమునఁ బండితరాయలవంటి వాని పయనము సుకరముగ సాగునవకాశముండి యుండదు.

పౌర్వాపర్యములు చక్కఁగఁ బరిశీలించుచో, నతఁడు ఢిల్లిలోనే యవర్ణయగు యవనతరుణి నెవతెనో చేపట్టియుండియుండు ననుటయ యుక్తియుక్తము. కోమల గాత్రలును, ఆకార సౌష్ఠవమును గల యవన మత్తకాశినుల సౌందర్యమునకు ముగ్ధుఁడైన పండితరాయల చాటువులందులకు నిదర్శనములు గాఁగలవు :—

శ్లో. యవనీరమణీ విపదః శమనీకమనీయతయా నవనీతసమా।
ఉహి ఊహి వచోమృతపూర్ణముఖీ నసుఖీ జగతీహ యదఙ్కగతా॥

శ్లో. యవనీ నవనీతకోమలాఙ్గీ శయనీయేయది నీయతే కథంచిత్।
అవనీతలమేవ సాధుమన్యే నవనీమాఘవనీ వినోదహేతుః॥

అవివాహితుఁడు, అస్ఖలితుఁడు, అత్యంత రసికుఁడు, అందముగల యువకుఁడునగు పండితరాయలవంటి విద్వదవతంసుఁడు 'స్త్రీ రత్నం దుష్కులాదపి'—యను వాక్యములోని పరమార్థమును గ్రహించినవాఁడు. కాన, నతఁడు లావణ్యవతియగు యవన యువతిం జేపట్టుట, అతిసాహస మగునేమో ; కాని యబ్బురము కాఁజాలదు.

జగన్నాథ పండితరాయలవంటి మహాపండితుని ఆకర్షించిన ఆభాగ్యశాలిని యెవ్వరో యించుక పరికింతము :—

'లవంగి' యను పేర నక్బరుపాదుషాకొక కూఁతు రుండె ననియు, నామె లోకోత్తర హావభావ విలాసవైఖరులం గని, పండితరాయ లామెను దనకిచ్చి పెండిలిసేయఁ జక్రవర్తిని "ఇయం సుస్తనీ మస్తకన్యస్తహస్తా లవంగీ కురంగీ దృగంగీకరోతు"—అని వేఁడెననియుఁ జెప్పుచున్నారు.

'లవంగి'—యను పేరు మహమ్మదీయ సాంప్రదాయ సిద్ధముగాదు. కాని, పాదుషా రసపుత్త్రి రమణులను దానును దనవారును 'నిఖా' చేసి కొన్నట్లు చరిత్రాధారము లుండుటచే, నావనితలలో నెవతెకేని యాపేరిటఁ బుత్త్రిక యుండియుండవచ్చు ననుకొన్నను—పండిత రాయలు ఢిల్లీ చేరుటకు ముందెప్పుడో మరణించిన యక్బరు నతఁడభ్యర్థించుట పొసఁగదు. మఱి యాకన్య, క్రీ. శ. 1605 లో గతించిన యక్బరు కూఁతురైనచో, నతనికి (అక్బరునకు) 60 యేండ్లకుఁ బైని బుట్టియుండవలెను. అట్టి వధువు జగన్నాథున కీడుజోడుగనుండునా, యనియు, లేఁతవ్వనింగాక, ప్రౌఢ నతఁ డంతగా వర్ణించునా. యనియు శంక గలుగుచున్నది. కాన 'లవంగి' యక్బరుకుమారి కాదు. పై శ్లోకవాక్య మతఁ డక్బరునుగూర్చి కాదుగదా జిహంగీరునుగూర్చి కూడఁగాక, షాజహానునుగూర్చి చెప్పియుండును.

తేలిన సారాంశమేమన :—'లవంగి'—యను పాదుషా బంధువర్గములోని యొకానొక రసపుత్త్రిమహిళ యొక్క తనూజను పండిత రాయలు

షాజహాను సమ్మతితోఁ బెండ్లాడె ననుట సే. ఇందుల కుపబలకములుగఁ గొన్ని కారణముల నిటఁ జేర్కొనుట అప్రస్తుతము గాదు.

(1) అక్బరు ప్రవేశపెట్టిన రసవృత్తి) యవనసంబంధ బాంధవ్య సంస్కరణము నానాఁటికి బలపడి, షాజహాను కాలమునను వృద్ధిఁ జేయుచు నవిచ్ఛిన్నముగ సాగుచుండినది. 'రాజానుమతో ధర్మః'-యను సిద్ధాంతమును రాజాశ్రితులు చాలవఱకు కాచరణమునఁ బెట్టుచుండిరి. అట్టివారిలోఁ బండిత రాయలుగూడ నొక్కఁడై యుండియుండుననుట సత్యదూరము గాదు.

(2) 'శ్రీ సార్వభౌమ శహజహాన్ ప్రసాదాధిగత పండితరాజ పదవీ విరాజితేన'—అని జగన్నాథుఁడు 'అసఫవిలాసము'న వ్రాసియున్నందున, నతనికది బిరుదమేగాక, రాజ్యాంగమున నొక గొప్పపదవి యనియుఁ బరిశోధకుల యభిప్రాయము. అష్టమంత్రులలోఁ 'బండితరాజ' పదవీ విరాజితుఁడు ప్రముఖుఁడు. అట్టి యున్నతపదవిని వహించువాఁడు అమిత మేధాసంపన్నుఁడుగను' రాజబంధువుగను, అంతరంగికుఁడుగను నుండవలెనుగదా! దీనింబట్టి యవనీభర్తృకత పండితరాయలకుఁ దప్పని సరియే యగును.

(3) అప్పటికి వృద్ధుఁడయ్యు, శ్రౌతస్మార్త నిష్ఠాతుఁడై, వైదిక ధర్మ రక్షాదక్షుఁడై యుండిన యప్పయదీక్షితుఁ డైతరాంగనా విశ్రుతుఁడును, సంస్కరణాభిలాషియు, యువకుఁడునగు పండితరాయలఁ గులభ్రష్టుఁడని ప్రచారము సేయుటచేతనే, యతఁడితని విమర్శనములకుఁ బాల్పడి యుండును.

(4) దారాషుకోహుతో మొగలుల సంబంధము త్రెంచుకొన్న జగన్నాథుఁడు తన జన్మభూమికి యవనగృహిణితో నేఁగుచోఁ, దనవారు సంభావింపరని తోఁచుటచేతనే, కాశిలోఁ గొన్నాళ్లు గడపి, భార్యాపుత్త్రులు గతించిన పిదప మధురకుఁ జేరియుండవలెను.

(౫) యవని నర్ధాంగిగాఁగొన్న విషయమును దనగ్రంథములలో నెక్కడను నతఁడు సంఘమునకు వెలచియే సూచించి యుండఁడు.

పండితరాయలు 'కామేశ్వరీ హృదయతో దయితో నయాతి' అని తనసతీమణి 'కామేశ్వరి'–యని పేర్కొనుటచే నామె మహామ్మదీయ సుందరి కాదనియు, నట్లేయగుచోఁ గులభ్రష్టుఁడగు తాను సపత్నీకుఁడై చేయఁదగిన వైదికకర్మలన్నియు నెఱవేర్చినట్లు "శాస్త్రాణ్యాకలితాని నిత్య విధయః సర్వేపిసంభావితా"—యని చెప్పికొని యుండఁడనియుఁ గొందఱి వాదము.

ఈ విషయమున వ్యాఖ్యాతల వ్రాఁతలెంతయు ససందిగ్ధములుగా నుండుట శోచనీయము. పండితరాయల పౌత్రుఁడనని చెప్పిన శ్రీ మహా దేవ సూరి 'కీదృశీదయితా దయాజ్ఞాతా యస్యాః సా భక్తవత్సలా దేవీ హృదయతోనయాతి'––యనియు, 'నిత్యమజ[illegible]—గావునఁ బుత్త్రి పౌత్త్రి వతి యనియుఁ దన వ్యాఖ్యానమునఁ జెప్పెనేకాని, ఆ 'కామేశ్వరి'—ని గూర్చియు, నామె యాభిజాత్యమును గూర్చియు స్పష్టముగ 'నిదమిత్థ' మని తెలుపలేదు. శ్రీ హరదత్త శర్మగారును—"కామేశ్వరీ—కామానాం ఈశ్వరీ, పూరణే సమర్థా దయితా ప్రియే।....నిత్యకల్యాణ రూపిణీ గృహాధిష్ఠాత్రీ, కామపూరణే సమర్థాచ మత్ప్రియా"—అని శబ్దార్థమును దెలిపి యూరకొనెనే గాని, 'కామేశ్వరి'—యెవరో విశదీకరించ లేదు.

కావున, యవనాంగనయే యాతని ధర్మపత్నియనుట సునిశ్చితము అగుచో, నిఁక 'శాస్త్రాణ్యాకలితాని నిత్యవిధయః సర్వేపి సంభావితా'— అన్న జగన్నాథుని వాక్యములు సత్యములగునా ?—ఏలకాఁగూడదు ? సంస్కరణాకాంక్షి యయినంత మాత్రమున, వర్ణాచార ధర్మములను వైదిక విధాన సిద్ధాంతములను, నొకకాంతకొఱ కమ్ముకొనవలసిన యవన

రము, ఉన్నతవంశ సంజాతుఁడును, సకల శాస్త్ర పారంగతుఁడును నగు పండితరాయలకుఁ దటస్థించి యుండదు. ముందుగ నట్టి నిర్ణయములో నర్చుకొనకయే. యామెం జేపట్టి యుండఁడు. తదనుగుణముగ నామెకు హైందవ సాంప్రదాయానుసారము పేరు ('కామేశ్వరి'యని) మార్చి సంస్కరించి యుండుననుటయు సంభవమే. గంగచే అతఁడు పవిత్రీకృతుఁ డయ్యె నన్న గాథయు ఇందులకు ఉపబలము కాఁగలదు.

'ఈ మహాపండితు నవర్ణపండితునిగ వర్ణించుట మహాపాప కార్య' మని శ్రీ ఖమిడి వారు వాపోయిరి. సత్యవిషయోద్ఘాటనమే పాపకార్యమగు నేని—మహర్షుల చరిత్రములు, అజామిళనిగమశర్మాదుల యుపాఖ్యానములు, వల్లవీపల్లవ—బీబీపల్లభుల గాథలు వ్రాసిన వారు మహా పాపాత్ములనవలసి యుండును. మొగలు సార్వభౌముని పాణిపల్లవతలమునఁ దన నవీనవయస్సును జెల్లించిన యీ మహా విద్వాంసుని 'శృంగారరసముల్లాసము' లోని ప్రతిశ్లోక మతని పరకాంతా ప్రణయమును సూచించుచుండ, దానిఁ గాదనుటెట్లు? మాదృశుల దృష్టి కయ్యది 'రసికత' యగును. అవర్ణ నతఁ డర్ధాంగిగాఁ జేకొన్నను. నామెయందలి యతని యనురాగము పారము; అచంచలము; అకలంకము. యవనియయ్యు, నా భామినీ మణియు మహా సాధ్వి: హైందవ (వైదిక) సాంప్రదాయముల నలవఱచికొని, మగనియడుగు జాడలలో నడచి యతని కానందము చేకూర్చినది. కావున నంత మాత్రమున నతనికీర్తికి భంగముకలిగినదని కాని, విమర్శకులకుఁ బాపము చుట్టుకొనునని కాని చెప్పుట బాలిశభీషికము. శాశ్వత జనవాక్య సరణీ ప్రభాభాసిత సత్యతేజః ప్రసారము నణంపఁదలకొనుట సత్యాన్వేషకులకుఁ దగిన పనికాదు.

ఆమె అవర్ణ అగుఁగాక! ఆమె అసలు నామము ఈ నాఁడు మనకుఁ దెలియక పోవుఁగాక! ఆ భామినీ ప్రస్తావమే భామినీ విలాస రచనకు పట్టు సాకువ అగుట కాదనరానిది. ఆ భామిని ఎవరైనను పండితరాయలు ఇట్టి ఉత్తమ కావ్యము రచించుటకు కారణభూతురాలై తాను ధన్యయై, సంస్కృత సారస్వతమును ధన్యమొనర్చినది.